గృహలక్ష్మి




# GRIHALAKSHMI

15th DECEMBER 1959

Vol. 28

No. 12

40 nP.



మణిపురి మహిళలు బుట్టలనిండా కుండల్ని తీసికొని సంతకు వెళ్లుతున్న దృశ్యము. మణిపురి స్త్రీలు గృహ పరిశ్రమల నిర్వహణలో సమర్థులు. సంతలలో బారులు తీరి తమ ఉత్పత్తులను అమ్ముచుండుట కనులకింపుగానుండును.




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిహా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్ :
సి. సి. పున్నయ్య



# శాంతిదూత ఐసెన్‌హోవర్

అభివృద్ధి అభ్యుదయాలతో వర్ధిల్లుతున్న దేశం అమెరికా. అంతేకాదు ప్రపంచ కళ్యాణమునకు దోహదం చేస్తున్న దేశంకూడాను. తన సకల సంపదలను, విజ్ఞాన వికాసాలను వెనుకబడియున్న దేశాల సౌభాగ్యమునకు అభివృద్ధికి స్వీయాభివృద్ధితో బాటు వినియోగించ ఆసక్తి చూపుతున్న దేశం అమెరికా. ఈ దేశం అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ వివిధ దేశప్రజలను, వారి మనస్తత్వాలను, అభివృద్ధి అభ్యుదయాలను స్వయంగాచూచి తెలిసికోవాలని చేస్తున్న విదేశయాత్రాసందర్భమున మనదేశమునకు రావడం, వారికి మనం అఖండ స్వాగతం హృదయపూర్వకముగా నివ్వడం మహదానందం.

ఐసెన్‌హోవర్ మనదేశానికి మిత్రుడుగా, శాంతిదూతగా వచ్చారు. అభివృద్ధి అభ్యుదయాలకు శాంతిభద్రతలు ముఖ్యావసరములు కాబట్టి వానిపట్ల ఆసక్తి చూపుచున్న దేశాలలో అమెరికా యొకటి. ప్రపంచములో సుస్థిరమైన శాంతిస్థాపనకు యీ

నాటి కలవరపాటు చెందియున్న వాతావరణంలోగల అవకాశాలను వెదకుతున్న ప్రపంచనాయకులలో ఐసెన్‌హోవర్ ఒకరు.

పరస్పర విరుద్ధభావాలుగల సమాజంలో శాంతిస్థాపనకు బలహీనులను సయితము బలవంతులుగా చేయడం అమెరికా కార్యక్రమం.

మన పంచవర్ష ప్రణాళికలకు అమెరికాచేస్తున్న సహాయం అపారము. శాంతి కాముక దేశాలుగా అమెరికా, ఇండియాలు నిర్వహిస్తున్నపాత్ర అత్యంతప్రాముఖ్యమైనది. ఆదర్శలక్ష్యాలు ఒకటైన యీ రెండుదేశాలు పరస్పర సద్భావ, సన్నిహిత సంబంధాలతో వర్ధిల్లడం మనకేకాక యావత్ప్రపంచానికి క్షేమకరం.

మన విదేశాంగవిధానము ప్రపంచములో ఏ బ్లాకులోచేరక మన అభివృద్ధి అభ్యుదయాల నుద్దేశించినదైనా, అమెరికా మనలను, మన సమస్యలను సానుభూతితోచూస్తూ సహాయం చేయుచున్నది. అందుకు మనము కృతజ్ఞత చూపవలసి యున్నది.

మన దేశమునకు ఐసెన్‌హోవర్ రాకవలన, ఇండియా, అమెరికా దేశాల మైత్రి దృఢతరమై పరస్పర సన్నిహితసంబంధాలు, సద్భావ సహాయసహకారములు మరింత వృద్ధిపొందగలవని ఆశిద్దాం!



# అభినందనలు

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి కాంగ్రెస్ ప్రెసిడెంటు పదవికి ఏకగ్రీవంగా ఎన్నికయిన సందర్భమున మేము హృదయపూర్వకముగా అభినందిస్తున్నాము.

ఆంధ్రప్రదేశ్ శాసనసభలో కాంగ్రెస్‌పార్టీ నానాటి బలీయమగుతూనే వచ్చుటకు కారణం శ్రీ సంజీవరెడ్డి ప్రజ్ఞావిశేషాలనే చెప్పాలి. అంతేకాదు వారి మంత్రివర్గహయాంలో సాధించిన అభివృద్ధి అభ్యుదయాలు యావదాంధ్రత మన్ననల నందుకున్నది.

శ్రీ సంజీవరెడ్డి నాయకత్వంక్రింద కాంగ్రెస్ ఎదుర్కొని పరిష్కరించవలసిన సమస్యలనేకమున్నా ఆయన శక్తిసామర్థ్యాలు, చిత్తశుద్ధి, జాతీయ ఆదర్శలక్ష్యాలపట్ల ఆసక్తి జాతీయనాయకత్వాన్ని బలపరచగలవని ఆశిద్దాం. సహచరులయొక్క, ప్రజలయొక్క సహాయసహకారాలతో కాంగ్రెస్ నాయకత్వము ఉమ్మడి శ్రేయోసౌభాగ్యములను తీర్చిదిద్దకలుగాలి.

శ్రీ సంజీవరెడ్డిగారు కాంగ్రెస అధ్యక్షుడగుట ముఖ్యంగా ఆంధ్రప్రజానీకానికి గర్వకారణం.

# మనిషిలో దానవత

శ్రీ ధాయిపులె బాలకృష్ణారావు

అర్ధరాత్రి కావస్తోంది మునిసిపాలిటి దీపము గుడ్డిగ వెలుగుతోంది. దీపపు వెలుతురు ప్రకాశవంతముగ లేనందువల్ల, పదడుగుల పరిసరాన్ని మాత్రమే కాంతి చీకటిని ఛేదించి, ఆ స్థలాన్ని తాను ఆక్రమించుకొంది. ఆ దీపపు స్తంభము నాలుగుదార్లు కలిసేచోటవున్నా వెలుతురు పరిమితమనే చెప్పాలి. నిశ్శబ్దము నిశాదేవి వొడిలో నిరాటంకముగ నిద్ర పోతుందనే కాబోలు కుక్కలు అప్పుడప్పుడు, అక్కడక్కడ, "బొవ్వౌ" మని మొరగడమువల్ల ఆ ధ్వని గాలిలో కలిసి, పరిసరాన్నంతా తుఫానులాగ అలుముకొనేది. ఆ ప్రదేశమంత నిర్మానుష్యముగ వుంది.

సందు మలుపులో ఒక చిన్నగుడిసె చుట్టు తడికలతో కట్టబడి, తాటాకులతో గోపురమువలె కప్పబడివున్న ఆ గుడిసెలోపల ఒకమూలన మట్టితో కట్టబడిన నాలుగడుగుల యెత్తుటి గోడ. ఆ గోడమీద ఒకదీపము కాంతివిహీనమైన వెలుగును విరజిమ్ముతోంది. ఆ గోడమీదనే ఒకమూలన చిన్న మురళి విగ్రహము సగము చీకటితో, సగము వెలుతురుతో కప్పబడివుంది. ఆ గుడిసెలో ఒకభాగాన నులకమంచముమీద చిరిగిన దుప్పటి సగమువరకు కప్పబడివున్న దీనదయాళుడు సన్నగ మూల్గుతున్నాడు. మట్టినేలమీద కూర్చొని తన తొడలపై తలవుంచి నిద్రపోతున్న సీతను యెడమచేత్తో జోకొట్టుతు, కుడిచేతితో మంచముపై పడుకొనివున్న దీనదయాళుని హృదయముపై నిమురుతు కునికిపాట్లు తీస్తోంది ముప్పయియేళ్ళ వయస్సుతో నిండిన ముగ్గురు పిల్లల తల్లి నీలవేలు. చాలీచాలక, అక్కడక్కడ చిరిగిపోయివున్న ఈతచాపమీద మూడేళ్ళ సుబ్బులు తల్లిప్రక్కనే నిద్రపోతోంది.

కునికిపాట్లుతీస్తు నిద్రపోతున్న నీలవేలు దీనమైన వదనములో పదునాలుగేళ్ళ దుఃఖపూరితమైన అనుభవము గూడుకట్టుకొని వుందా అనిపిస్తుంది. నీలవేలు బక్కచిక్కి వుంది. ముఖములో కళ లేనేలేదు. సంసారజీవితములో దిగేముందు ఆమె వదనములో ఎంతో కళ వుట్టిపడుతుండేది. సుఖజీవనాన్ని గడుపాలని పెళ్ళి అయినదినాల్లో దేవున్ని కోరుతుండేది. అయితే, స్వానుభవములో తను కోరుకున్నదానికి విపరీత ఫలితాలను చవిచూసింది.

ఎప్పుడూ తన పిల్లల సుఖము భర్త సుఖము కాంక్షిస్తు వుండేది. భర్తకెన్నోసార్లు చెప్పిచూసింది. త్రాగుడు మానుకోమని, రాత్రులు ఎక్కడికి వెళ్ళవద్దని. తిప్పన్న అవేమి పట్టించుకోలేదు. పైగా చితకదన్నేవాడు. అతని కోపతాపాలకు నోరెత్తేది కాదు. కూలిడబ్బులు తీసుకొచ్చి కాస్తాకూస్తా యిచ్చి వెళ్ళేవాడు. ఆ డబ్బుతో నీలవేలు గంజియో, సంకటి అన్నమో వండి తనపిల్లలు, తానూ తినేవారు. డబ్బు యివ్వనిరోజుల్లో మజ్జిగత్రాగి వుండేవాళ్ళు. ఇలాగె రోజులు గడుచుక వెళ్ళాయి.

గుడిసెలో చీకటి వెలుగులతోపాటు నిశ్శబ్దము గూడ ఆవరించుకొని వుంది. ఆ నిశ్శబ్ద వాతావరణము అలా ఎంతసేపుండి పోయిందో, ఆ గుడిసెలోవుండే మానవుల కెవ్వరికి తెలియదు.

దీనదయాళుడు సన్నగ మూల్గడము ప్రారంభించాడు.

వాకిలి కిర్రుమనే శబ్దముతో మూలుగు కంఠధ్వని క్షీణించిపోయింది. గుడిసెలో పరివృతమైన నిశ్శబ్దము మాయమైపోయింది. ముగ్గురు స్త్రీలు లోపలకు వచ్చారు. అందరు నిద్రలో పడివున్నారు.

"అమ్మా! నీలమ్మ! లేవమ్మ పిల్లాడు మూలుగుతున్నాడు" అంది రామమ్మ.

అంకాలమ్మ నీలవేలు భుజముమీద తట్టుతు, "లేవే! నీలవేలు. అలా నిద్రపోతున్నావు. ఎప్పటినుంచి మూలుగుతున్నాడో కద. వినబడ్డంలే... లే... లే. పసికందు బాధపడుతుంటేను" అంది.

శాంతమ్మ దీనదయాళుని చేతిని పట్టుకొని డాక్టరులాగ చూసింది. "అబ్బే జ్వరమేమి లేదె. పిల్లాడు నీరసంగా వున్నాడు. అంతే." అంటూ "ఏం, బాబు ఏం కావాలి? నీళ్ళు తాగుతావా. మా బాబు మంచోడె. సంక్రాంతికి మీ బాబుతో చెప్పి మంచి మంచి బట్టలు కుట్టించుకో. మనముందరము దేరా ...

ఆడే ఆటకు పోదాము..." అంటూ దీనదయాళుని తల నిమురుతు కృశించిపోయిన ముఖము వేపు జాలిగ చూస్తూ నిలబడింది."

"ఏమె, నీలవేలు. నీ మొగుడింక రాలేదేమే. ఏం పోగాలమోనమ్మ. బంగారంలాంటి పిల్లల్ని, భార్యని యిడిచి ఎక్కడంటె అక్కడ పడుంటాడు." అంటూ ముక్కుమీద వ్రేలిడుకుంది నలభై యేళ్ళ ముత్తైదువ రామమ్మ.

"ఏమోనమ్మ భార్యాపిల్లలుండే మొగాళ్ళు చీకటి పడకముందె యిల్లు చేరుకోవాలి" అంకాలమ్మ అందుకుంది.

దీనదయాళుడు నీరసముగ ఏదో గొణగడము వినిపించింది. అది అస్పష్టముగ వుంది. దగ్గరలోవుండే శాంతమ్మ అడిగింది.

"ఏం బాబు! ఏం కావాలి?"

"అమ్మా! ఆకలిగ వుందే. కడుపు తిప్పుతోంది." కంఠములో బాధ స్పష్టమవుతోంది. కనురెప్పలు బరువుగ యెత్తి అమ్మ వేపు చూశాడు. నీలవేలు కళ్ళు తడి అయ్యాయ్. చీరకొంగుతో కళ్ళు తుడుచుకుంటు, అక్కడినుండి లేచి, ఒక పాత్రలోని గంజిని తెచ్చింది. దీనదయాళుడు అది చూచి,

"ఎప్పుడు ఆ వుప్పుగంజేనేమే. నాకొద్దు పో."

"నామాట యిను. దీన, ఇది కొంచెము యేసుకో నోట్లో. మా నాయిన గదునే. కొంచెము..." అంటు బలవంతముతో రెండు గుటకలు త్రాపించింది. నిట్టూర్చింది నీలవేలు.

"ఏమి మొగుడమ్మ తన ఆరోగ్యము సూసుకోడు. పిల్లల సుకము సూసుకోడు. తెచ్చేడబ్బులు యెవరికో అంటబెడతాడు" రామమ్మ అంది.

"ఔనేతల్లి! ఏం కాలమొ. యిపరీతముగ మారి మనుసుల్ని మాయదారి పట్టిస్తుంది ప్చ్...ప్చ్... తెచ్చే డబ్బుతోనె అయ్య-అప్ప రామచంద్రో అనుకుంటు లచ్చనంగ దేవుడ్ని స్మరనం సేసుకుంటు పిల్లల్ని సూసుకుంటు వుండొచ్చునె" అంకాలమ్మ అంది.

ఈ విధముగ నలుగురితో నాలుగు మాటలనిపించుకోవడం కొత్తకాదు. వాళ్ళు చెప్పుకునే విషయాల్ని వింటు మనసులో బాధపడేది నీలవేలు.

ఈ అలజడికి సుబ్బులు, సీను లేచికూర్చున్నారు. అర్థముకాని చూపులతో అమ్మ వేపు చూస్తుండిపోయారు.

శాంతమ్మ యిప్పుడే వస్తానని చెప్పి, ముంతలో మజ్జిగ వేసుకవచ్చింది. "తలాయింత తాగండర్రా" అంటూ దీనదయాళుని కిచ్చింది.

నీలవేలు తన విధికి చాల విచారపడుతు, వచ్చిన వారు తమపై ప్రేమ చూపడమువల్ల వాళ్ళను మనసులో అభినందించుకుంది.

"ఇంక నిద్ద పొండర్రా" అంది శాంతమ్మ.

వచ్చినవారు ముగ్గురు వస్తామమ్మ అంటూ సెలవు తీసుకొని వెళ్ళిపోయారు.

"ఏం ఖర్మనే యిది. ఎప్పుడూ యింతె" పోతూ ఒకామె గొణిగింది.

"యిదిరాతనే తల్లి" అంది శాంతమ్మ.

"ఏం మొగుడే మనిషైతేనా."

ముగ్గురు పిల్లలు మేను వాల్చారు. నీలవేలు కంట తడిపెడుతూ, ఏవో తలచుకుంటూ అశాంతిగ నిట్టూరుస్తు మగతనిద్రలో పడ్డది.

◆ ◆ ◆

"ఏయ్ రంగసాని! ప్రపంచమంత మాయేపిల్ల. నూతేందె నాకు పపంచము సూన్యమె. తెలిసిందా పిల్లా!" అంటూ రంగసానిని దగ్గరకు లాక్కున్నాడు. బాగుగ వన్నెచీరతో అలంకరించుకొని, సహజత్వాన్నంత పోగొట్టుకున్న వన్నెలాడి రంగసాని తిప్పన్న బాహువుల్లో యిమిడిపోయింది.

"ఏంటి సారాయివాసన - కంపు. హు," మూతి ప్రక్కకు తిప్పుకొంది.

"ఏంటే అలా కూత్తవ్. అమృతమే యిది. అమృతము" అంటూ బుగ్గమీద ముద్దెట్టుకున్నాడు. రంగసాని ఏమనలేదు.

"రేపు నీకో మాంచిచీరే తెత్తాను. నాకేమిత్తావ్ చెప్పు." తిప్పన్న రంగసానిపై వుండె వ్యామోహంతో అడిగాడు.

"తీసుకురా మొదట. తీసుకొచ్చినప్పుడు కద. నువ్వెంత మంచి చీర తీసుకొస్తే అన్ని ముద్దులు ఎక్కువ"... అంటూ చిరునవ్వు చిలికించింది. నిషాలోవుండే తిప్పన్న ఆదోరకంగ నవ్వాడు.

"నా... పిల్ల... ఉంటే నీలాంటోల్లే వుండాలి. నాలాంటోల్లను ఉద్దరిస్తారు" అన్నాడు. రంగసానిని వదిలేసాడు.

"సరేపిల్ల. రేపటికి ఖాయం. వత్తామరి" అంటూ కన్నుగీటాడు. తిప్పన్న ఆ ప్రపంచమునుండి బయట

పడుతున్నాడు. కూలిపనిచేసి, రోజంత కష్టపడి సంపాదించిన డబ్బు - డబ్బంటే విలువ తెలియని తిప్పన్న, తాను సంపాదించినదంత హారతి కర్పూరంలా ఆ రోజే రంగసానికి అర్పించాడు. ఇది మామూలుగ రోజూ చేసేపనే.

ఆ వూరిలో తనకు తెలిసిన, తెలిసిన వారనుకున్న వాళ్ళు తిప్పన్నకు శతవిధాల చెప్పేవారు. అయినా, అతనికి అవేమి ఒంటబట్టలేదు. మంచికిపోతె మూర్ఖుడు అనిపించుకున్నట్లు, ఎవరైన తిప్పన్న దగ్గరికి పోయిరో, లేక అతనిని పిలిచిరో

"తిప్పన్నా, భార్యాపిల్లలు గలవాడివి. అంతో యింతో బాధ్యత అంటే ఏమిటో తెలిసికొని వుండాలి. అటుభార్య పస్తుగవుంటు, యిటు పిల్లలు అన్నమో రామచంద్ర అంటూ ఏడుస్తుంటే ఏమిటి తిప్పన్న యిది—నానావస్థలం పెడుతున్నావ్ అందరిని. అట్లా కాకుంటె, వేశ్యైన చేసుకోకుండ వుండాలి" అని చెబితే

"చాల్లేవయ్యా, బోసెప్పొచ్చావ్ పెద్ద మనిషి లాగ. నాయిట్టమొచ్చినట్టు చేత్తా, నువ్వోరివి." అంటూ జుబ్బా ముడవడము అలవాటు తిప్పన్నకు. ఇంకొకసారి, ఆ వూరిలోవుండె ఒకటీచరు తిప్పన్నకు ఏదో నచ్చచెప్పాలనుకున్నాడు.

"తిప్పన్నా" అంటూ బుర్రమీసాలు మెలి వేసుకుంటూ పోయె తిప్పన్నను పిలిచాడు. తిప్పన్న ఎంతో నమ్రత ప్రకటిస్తు పంతులు దగ్గరికి వచ్చాడు.

"ఏం బాబు పిలిసారు."

"చూడు తిప్పన్న, పిల్లలకేవో రెండు బట్టలు కుట్టియ్యాల్సింది. చిరిగిపోయిన బట్టలతో అసహ్యంగా వస్తున్నారు. నీ త్రాగుడు కొద్దిగ మానెయ్. మీ నాన్న గారున్నపుడు మంచిపేరు తెచ్చుకొన్నారు. నువ్వుచాల మారిపోయావు. ఇంట్లో అందరు ఆకలితో బాధపడుతుంటేను, నువ్వేమో సాని ..."

"చాల్లేవయ్యా. నీవు నీ సోద. సిన్న పిల్లలకు సెప్పినట్టు సెప్పుతున్నావు. ఏదొలె, అయ్యవారు సెప్పక పోనీలెఅని వూరుకుంటె యింకా సెప్పక పోవడమేన. పాఠాలు సెప్పేవాడివి, సెప్పేంతవరకే వుండాలి. హద్దులు మీరిపోతే" అంటూ కన్నులుబుస్సుమన్నాడు తిప్పన్న. టీచరు గారికి ఎక్కడలేని కోపము ముంచుక వచ్చింది. అయితే ఏమియు అనలేకపోయాడు. అప్పటినుండి టీచరుగారు తిప్పన్నను పిలువడముగాని, ఏదైన చెప్పడముగాని మానేశారు. ఇలాగె, ఎందరో తిప్పన్నను మంచిగ వుండమని చెప్పుతుండేవాళ్ళు. కాని, అందరు పరాజితులయ్యారు. తిప్పన్నంటే అందరికీ ఒకవిధమైన భయము. అతని విగ్రహముతో పాటు స్వభావము యితరులను భయం కలుగజేస్తుంది.

♦ ♦ ♦

రంగసాని యింటినుండి బయటపడ్డాడు తిప్పన్న. 'అప్పన్నా తనామన - మావూరి భైరన, మనమూటంటె — మాదలన్నా, మారుజెప్పితే మక్కెలిరుగ తంతామన్న, మంచిగవుంటె మనమూరకుంటామురన్న - ఓరన్న'— బూరమీసాలు మెలివేసుకుంటు, తప్పత్రాగిన తిప్పన్న తూలుతు, నోటికి వచ్చినది పాడుకుంటు చీకటిని చుట్టుకొని, చీకటిలోనే తప్పటడుగులు వేసుకుంటు ముందుకు పోతున్నాడు. వీధిలోని మునిసిపాలిటి లాంతరులో కిరసనాయిలు అయిపోవడమువల్ల దీపము అప్పుడో, యిప్పుడో ఆరిపోయె స్థితిలోవుంది. తిప్పన్నను చూసి దారిప్రక్కన పడుకొనివున్న కుక్క మొరిగింది. "ఛా! ఏమిటే అలా రొదసేస్తవ్. నీ అబ్బగంటు పోయిందా? ఇస్, గప్ చిప్, అరిసావ అడే దగ్గరికి పోతావ్." మాటలు పడుతున్న కళ్ళతో చూసి, నిసాలో చెప్పాడు. తిప్పన్న మాటలకు ఖాతరుచేయక కుక్క యింక గట్టిగ మొరగడం ప్రారంభించింది. "ఏయ్. ఛుప్. నువ్వో నాకు తోడయ్యావ్. నాకు నీలాంటోల్లు సాలమంది వున్నారులే" అంటూ కుక్క భాష అర్థం చేసుకున్న వాడిలా తిరుగుజవాబు చెప్పాడు. తిప్పన్న కంటే తనబ్రతుకే నయమనుకొని కాబోలు కుక్క అరవడము మానివేసి ఓ మూలన పోయి పడుకుంది.

తిప్పన్న నానావస్థలు పడి గమ్యం చేరుకున్నాడు. గుడిసె చీకటిగ వుంది. వాకిలి కిర్రున తెరుచుకుంది. తిప్పన్న లోపలికి ప్రవేశించాడు. దట్టముగ అలుముకొనివున్న చీకటిలో కంటికి ఎవరు కనబడడము లేదు. మెల్లిగ వెక్కి వెక్కి ఏడుస్తున్న గొంతు అస్పష్టంగ వినబడింది.

"ఛీ ఏమిటీ రొద, ఎప్పుడు యింతే. కొంపకు సస్తే ఏడుపుతో పారంభము కత (కథ). ఏయ్ నీలి ఎక్కడ సచ్చావ్" తిప్పన్న గర్జించాడు. కళ్ళనీళ్ళు తుడుచుకొని, దీపము అంటించింది నీలివేణి. సారాయి వాసన గుప్పున కొడుతుంది. గుడిసెఅంతా ఆ వాసనతో నిండిపోయింది.

(603 వ-పేజీ చూడుడు)

# స్వప్న సుందరి

శ్రీ కేశిరాజు సోమేశ్వరరావు



రైలుస్టేషనులో మ్రోగినగంట విని రాజు రెస్టారెంట్ బయటికి వచ్చాడు. మూడవ తరగతి ప్రయాణీకుల వెయిటింగ్ హాలు నిండిపోయిన బీడీపొగలతో దుర్వాసన కొడ్తోంది. ఎదిగిన గడ్డంలా చీకటి నలుమూలలా ఆవరించింది. మెలికలు తిరిగిన మీసాల్లా మబ్బుతోరణాలు చంద్రుడి చుట్టూ మూగాయి. సిగరెట్ వెలిగించి ప్లాట్‌ఫారంపై పచారుచేస్తూ బుకింగ్ ఆఫీసు వద్దకు వచ్చాడు రాజు. ఆఫీసు బయటనున్న గ్రుడ్డిదీపపు వెలుతుర్లో మెయిలు గంటన్నర లేటన్న బోర్డు కన్పించింది. ఇంకా గంటన్నర పడిగాపులుపడి కూర్చోవాలి. రైళ్లకు ఆలస్యంగా రావడం అలవాటయిపోయింది అనుకున్నాడు.

రోజంతా ఆఫీసువర్కుతో అలిసిపోయిన అతని శరీరానికి ఎదురుగానున్న మైదానంమీంచి వీస్తోన్న చల్లటిగాలి హాయి కలిగించింది. ఆవలింతలు బయల్దేరాయి. నెమ్మదిగా నడుస్తూ, ప్లాట్‌ఫారం చివరకు చేరుకున్నాడు. సాయంత్రంబట్టీ విరామమెరుగని కాళ్లు లాగుతున్నాయి. బద్ధకంగా సిమెంటు బెంచీమీద కూర్చున్నాడు. వెనుకనున్న రైల్వేక్వార్టర్సులోంచి గడియారం అర్ధగంట కొట్టింది. రాజు రిస్టువాచీవంక చూసాడు ఎనిమిదిన్నర అయింది. గాలికి రెపరెపలాడే చొక్కాకాలరు సవరించి, జేబులోంచి తొంగిచూస్తోన్న కార్డును బయటకు తీసాడు. మసకచీకట్లో అక్షరాలు అలికేసినట్లు కన్పించాయి. కార్డుమధ్యగా పరిచితమైన స్త్రీరూపం కళ్లముందు తిరిగింది. ఇంకా గంటకుగాని ఆమెరాదు అనుకున్నాడు. బరువుగా వాలిపోయే కనురెప్పలు, అలిసిపోయిన మెదడు వాంఛించే విశ్రాంతిని కలిగించ ప్రయత్నిస్తున్నాయి. కాలిక్రింద గడ్డిలో ఏదోపురుగు కదిలి చక్కిలిగింతలు పెట్టింది. ఎడమచేయి దిండుగా చేసుకుని ఓరగిలి బెంచీమీద పడుకున్నాడు రాజు. అలవాటులేని పడకయినా హాయి అనిపించిందతనికి. ఆ హాయిలో అతని మనస్సు వింత వింతలోకాల్లో విహరించసాగింది. కార్డుమధ్య మెదిలిన సుందరి క్రమక్రమంగా అతని మనోపథంనుంచి మాయమైపోయింది.

◆ ◆ ◆

ప్రయాణీకులు ప్లాట్‌ఫారంనుంచి తొంగితొంగి రెండువైపులా చూస్తున్నారు. ఇంతలో సిగ్నలురెక్క వాలింది. జనం నలుమూలలా కలకబారారు. సామాన్లను పోర్టర్లు మోసుకొస్తున్నారు. పసిపిల్లల్ని తల్లులు చంకల్లోంచి భుజాలమీదకు తీసుకొంటున్నారు. జేబుల్లోని టిక్కెట్లు, డబ్బు ఉందో లేదో చూసుకుంటూ, పంట్లాంలు తడుముకుంటున్నారు కొందరు. ఒకటి...

రెండు... అని సామాన్లను లెక్కపెడుతోంది ఓ ముసలమ్మ.

రైలు నెమ్మదిగా ప్లాట్ ఫారంలో ఆగింది. ఇంజన్ వదలే ఆవిరిశబ్దం వంద కీచురాళ్ల రొదవలె వుంది. గబగబా నడుస్తూ, ఖాళీపెట్టెలకై వెదుకుతూ ఒంటిగానున్న ప్రయాణీకులు ముందుకు సాగి పోతున్నారు. సామాన్లను, సంసారాన్ని వేగించుకుంటూ శద్దీగా ఉన్నా దగ్గరనున్న పెట్టెల్లోకే ఎక్కాలని కొందరు ప్రయత్నిస్తున్నారు. లోపలివాళ్లు దిగనీయకుండా ఎక్కేస్తోన్న ప్రయాణీకుల త్రొక్కిడిచూచి "ఇక లాభంలేదని" గుంపులో దూరుతూ గట్టిగా కేకలేస్తున్నారు కొందరు. హై హీల్డు షూస్ తొడుక్కున్న మ్మాయి సెకండుక్లాసు పెట్టెలోకిపోతూ తొందరలో షిఫాన్‌చీరపైట జారిపోగా సర్దుకోబోయేటంతలో కాలు తడబడి తూలిపోయింది: ఆమెనుచూస్తూ పకపకా నవ్వుతూ నడుస్తున్న యిద్దరు కాలేజి విద్యార్థులు ఓ బిచ్చగత్తెమీదపడి, పైగా ఆమెను అసహ్యించుకొంటున్నారు. మొరటుగా ఎక్కే గుంపును తోసుకుంటూ వాళ్లమధ్య నలిగి వాడిపోయిన మల్లెపువ్వులా ఆమెఆడవాళ్ల పెట్టెలోంచి చిన్న చేతిసంచీతో దిగింది.

ఆమెను చూడగానే రాజుకు ఎక్కడో చూసినట్లుగా అనిపించింది. ఎక్కడ చూచాను చెప్మా ఈవిడ్ని అనుకున్నాడు. ఆమె అలా ముందుకునడిచి రాజుకు సమీపాన నిల్చుంది. పెట్టెలోంచి పడుతున్న ఎలెక్ట్రిక్ లైటు వెలుగులో ఆమె ముఖం వింత అందంతో ఆకర్షణీయంగా ఉంది. బత్తాయి తొనల్లాంటి పెదవులు, పెదవుల పైగా నూవుపువ్వులాంటి ముక్కు, దాని కిరుప్రక్కలా అర్ధ నిమీలితాలయిన కండ్లు, అరసున్నల్లాంటి కనుబొమలు తను బాగా ఎరిగినావిడేనని రుజూపర్చాయి. కాని ఎవరీమె ?

అకస్మాత్తుగా అతనిదృష్టి బత్తాయి తొనల్లాటి పెదవుల క్రిందగా గడ్డంలో నున్న సొట్టలో స్పష్టంగా కనబడుతోన్న కందిగింజంత పుట్టుమచ్చమీద పడింది. నిశ్చయంగా ఆమే .. తీవ్రంగా ఆలోచించాడు రాజు. అతనిముఖం వికసించింది.

"శ్రీదేవీ" గట్టిగా అరచి పిలచాడు. ఇంకొంచెం గట్టిగానయితే పెద్దకేక అనవచ్చు. "నేనూ! నీ బాల్యస్నేహితుణ్ణి! రాజును. అదేమిటి అలా తెల్లబోయి చూస్తావ్. గుర్తుపట్టలేక పోయావా." సంతోషంతో ఆమె దగ్గరగావెళ్తూ అన్నాడు రాజు.

ఆమె వింతగా అతనివైపు చూసింది. నీవెవరో నాకు తెలియదే అన్నట్లుందా చూపు. "ఎంత మారిపోయావు. ఈ అయిదేళ్లలో చాలా పెద్దదానివయ్యావు. నేనే నిన్ను గుర్తుపట్టలేకపోతే? ఇంకా ఆ క్వశ్చన్‌మార్కు ముఖమేనా. నేను రాజు అవునో కాదో అని ఆలోచిస్తున్నావా .." ఆమె ఉలిక్కిపడి చూసింది. కనుబొమలు గ్రుడున తిరిగి యథాస్థానానికి వచ్చాయి. నఖశిఖపర్యంతం ఎగాదిగా చూసి అటువైపు ముఖం త్రిప్పుకొంది,

ప్రక్కకుతిరిగిన ఆమె ముఖం సినిమాలో సావిత్రిలా అందంగా ఉంది. మధ్యగా మూశంకెలాగున్న చెవిచుట్టూ రేగిన

వెంట్రుకలు గాలికి కొట్టుకుంటూ చెంప లపై పడుతున్నాయి.

"ఇదేమిటి ఈమె విచిత్ర మనస్తత్వం. మా చెల్లెలొస్తున్నది. స్టేషనుకు రారమ్మ నమని వేణు ఉత్తరం వ్రాయడమేమిటి! తీరా ఇప్పుడు ఈమె మొగమెరగని వ్యక్తిని చూడనట్లు తన్ను చూడడమేమిటి! ఈ ఐదేళ్లకే నన్ను మరిచిపోయిందా. లేక నటనా" అనుకున్నాడు.

"అదేమిటి శ్రీదేవి, అలా ముఖం త్రిప్పు కుంటావు. క్రొత్తవాణ్ణి చూసినట్లు ఆ చూపులు నువ్వూను. ఇదిగో ఈ కార్డు చూడు, మీ అన్న వేణు రాశాడు నువ్వొ స్తున్నావనీ, నన్ను స్టేషనుకు రమ్మనమనీ. నన్నెరగనట్లుగా నటించి కాస్సేపు నన్ను తికమక పెట్టాలనుకుంటున్నావా? ఇంకా నీ చిన్నప్పటి చిలిపితనం పోలేదు." రంగులు మారిన ఆమె ముఖంచూసి తన ఉపన్యాసం నిలిపేశాడు.

రెండడుగులు ముందుకువేసి ఆమె రిక్షా వాణ్ణి పిలిచింది. రాజుకు ఇంకా అను మానం పోలేదు. కంగారుగా "రిక్షా ఎందుకు దేవీ! ప్రక్కవీధిలోనే మనఇల్లు. అమ్మమ్మకూడా అక్కడే ఉంది. సరదాగా మాట్లాడుకుంటూ పోదాంపద. అరఫర్లాంగు కూడా ఉండదు" అన్నాడు. ఆమె విని పించుకోకుండా ముందుకు నడిచింది.

ఏమిటీ విపరీతం? నేనేం భ్రమపడలేదు గదా - గడ్డంలో సొట్ట. సొట్టలో పుట్టు మచ్చ. అచ్చంగా ఆమె! చిన్నప్పుడు ఎంత చనువుగా ఉండేది! యీ అయిదేళ్ళలో ఎంతగా మారిపోయింది! రాజు తలెత్తి చూసాడు ఆమె వెళ్ళిపోతోంది. మళ్లీ గట్టిగా పిలిచాడు ఆమెను.

ఆమె వెనక్కు తిరిగింది. కోపంగా "ఏయ్ మిస్టర్! నీవెవరో నాకు తెలియదు. నిన్నింతకు ముందెన్నడూ చూడలేదు. ఎందుకు ఎవరో అనుకొని వెంటపడతావు. పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యక వెనక్కిపో. లేకపోతే పోలీసుల్ని పిలవాలిసి వస్తుంది" అంది. ఇంతలో రిక్షావాడు "ఏంటయ్యా ఒంటరిగాచూసి అమ్మాయిగారి మీద మీదకు వొస్తున్నావ్; జాగ్రత్త" అంటూ ముందుకువచ్చాడు. వాడి కేకలకు ప్లాట్ ఫారమ్మీద ఉన్న నలుగురూ పోగ య్యారు. రైలుబండి తన విద్యుక్తధర్మ నిర్వహణలో లీనమై గట్టిగా కూతవేసి భారంగా కదిలింది.

"ఒంటిగా ఆడపిల్ల కనిపిస్తేసరి ఒళ్లు తెలియదు యీ జల్సారాయుళ్ళకు. వయస్సు వచ్చేకొద్దీ కాస్త జాగ్రత్తగా మసులుకోవాలి" అన్నాడు ఓ తలనెరసిన పెద్దమనిషి, నెరవని మీసాన్ని కుడిచేత్తో చక్కదిద్దుకుంటూ. ఏమిటేమిటని స్టేషను మాస్టరు పరుగెత్తుకొచ్చాడు, నలుగురూ గుంపుగూడటంచూసి. గుంపులో ఎవరో జేబులు జాగ్రత్త అన్నారు. "మెడలోని నగలు కొట్టేయడానికి వేసినఎత్తు. ఆమె వద్ద వాడిపప్పు లుడకలేదు. దొంగవెధవ." తమ అమూల్యాభిప్రాయాన్ని గాలికి వది లేశారు మరొకరు. రాజుగుండె ఆగినంత పనయింది.

"దొంగలంటే ఇలాగే పొడుగుచొక్కా పొడుగులాగు తొడుగుకొంటారు కామోసు" అనుకుంది తండ్రి చెయ్యిపట్టు కుని వేడుకచూస్తున్న పదేళ్ళపిల్ల. "ఎవరు నువ్వు. ఆమెతో నీకేంపని.. రా స్టేషను

(602వ-పేజీ చూడుడు)

# మన నాటకం

## [పంచవర్ష ప్రణాళికలు]

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

(గతసంచిక తరువాయి)

## మూడవరంగం

[ప్రదేశము :_బంగారయ్య గృహము.
ప్రవేశము :_బంగారయ్య, రాఘవయ్య]

బంగారయ్య:_రాఘవయ్యా! మన గ్రామములోని పేదలకు ధాన్యము ఎవరెవరికెంత కావలయునో తెలిసికొనుము. ఒకపట్టిక తయారు చేయుము.

రాఘవయ్య:_బంగారయ్యగారూ! మీరిలా సహాయము చేసినప్పుడు ప్రజలందరు సంతోషించి మీ మేలును మరువరు.

బ:_నేను ధనవంతుడనై యుండి మన గ్రామప్రజలకు సహాయము చేయకుంటే మహాపరాధము చేసినవాడనగుదును. నావద్ద ధనమున్నందుకు లాభమేమి?

(తెరలో) — పాట —

సర్వోదయం! సర్వోదయం! సర్వోదయం!
సర్వోదయమే సర్వమానవుల సౌభాగ్యప్రదము!

రా:_ఆహా! మన కమలమ్మగారిటు వచ్చుచున్నారు.

బ:_కమలమ్మగారెవరు?

రా:_మన మాధవయ్యగారి భార్య.

బ:_అలాగునా?

[కమలం పాడుచూ ప్రవేశించును. బంగారయ్య, రాఘవయ్య ఎదురేగి నమస్కరింతురు]

కమలం:-

—(పాట)—

[ఈ పాట బుఱ్ఱకథవలె పాడవచ్చును.]

సర్వోదయం! సర్వోదయం! సర్వోదయం!
సర్వోదయమే సర్వమానవుల। సౌభాగ్యప్రదము!
సర్వమానవు లొకటేయన్న। సద్భావము వలయు
ఱెక్కచిక్కిన రైతు లోకమును। బాగుపరచండీ!
కడుపు కాల్చుకొని కష్టపడే మన। కర్షకుల గాంచండీ!
మట్టిని నమ్మి మెలగే రైతుల। మదిలో దలచండీ!
పొలమున చెమ్మటపోసే రైతుల। పోకడ తెలియరండీ!
బండచాకిరీ చేయు కార్మికుని। బ్రతుకు తెలియరండీ!
కార్మిక, కర్షక శ్రమఫలమే మన। కడుపు నింపునండీ!

రా:_ఔనౌను, - నిజము, నిజము.

క:_ పేదల దుస్థితిని తెలిసికొని
గాంధిమహాత్ముని ప్రియశిష్యుండు। ఘనుడు వినోబాజీ.

బ:_ఆహా! వినోబా భావేగారా? _ పూజ్యులు, పూజ్యులు.

క:-గాంధిజి యంతటి మహానుభావుడు। ఘనుడు వినోబాజీ,
పేదల సమస్య తీర్పనెంచె నీ। ప్రేమ మానసుడు,
ధనవంతుల నర్థించి భూములను। ధనహీనుల కొసగ,

రా:_ఆహా! ఎంత గొప్ప ఆశయము!

క:-భూదానయజ్ఞమును సలుపుచుండె నీ। పుణ్య పూరుషుండు
లభియించె నేటికి నలుబది పైగా। లక్షల యెకరములు
వినోబాజీ విధము తెలిసి మీ। వితరణ జూపండీ!

వెలలేని సంపదల మూలదాగెను మీ । విలువ
చూపరండీ !

రా:- సంపదలకు తగినఫలము చూపెట్టాలి !

క:- తోడి మానవుల గోడు నెరిగి చే । దోడు
జూపరండీ !

భూస్వాములు నిరుపేదల కొరకై । భూదానము
సలుపండీ !

ధనవంతులు నిరుపేదల కొరకై । దానము
సలుపండీ !

వచ్చేటప్పుడు పొయ్యేటప్పుడు । పుచ్చు పోక
రాదు ।

రా:- ఔనౌను, ఎవరికేమి శాశ్వతము.

క:- శాశ్వతముగ సత్కీర్తి యొక్కటే । విశ్వములో
నిలచు,

చిత్తానుసారము సలుపరండి మీ । ఉత్తమ
దానములు,

బ:- దాన ధర్మములు చేయని వారు, దయా దాక్షిణ్యములు కలుగని వారు ప్రపంచమున కపకారము చేసిన వారే యగుదురు.

క:- సత్ఫలము గాంచు మీ ఉత్తమ దానంబు ।
నిష్ఫలము గాదు నిరుపేదల గాపాడు ।
పాత్రోచితముగ పంచిపెట్ట బడును ।

రా:- నిజమే, వినోబాజీ యంతటివారే భూదాన యజ్ఞము చేయుచుండగా నిష్ఫలమేల యౌను ?

క:- కూడూ గుడ్డా -
కొంద్రకు కొదువై ।
కొంపకు కొదువై ।
గోడును చెందే
తోడి మానవుల - గా
పాడగ జేయును
తోడ్పడండీ !
తోడ్పడండీ !
ధర్మదాతలారా !
కారుణ్య హృదయులారా !
సాధించండీ !
సాధించండీ !

సర్వోదయం ! సర్వోదయం ! సర్వోదయం !

బ:- తల్లీ ! మీరు వినోబా భావేగారి ప్రచారకులా ?

క:- ఔను, నా ప్రాణేశ్వరుని యనుమతిపొంది యీ కార్యమునందు జేరితిని.

బ:- భూదాన యజ్ఞమునకు నేనెట్టి సహాయము చేయవలెనమ్మా !

క:- మీ సంపదలో 1/6 వంతు పేదలకొరకు దానము చేయవలసినదని అర్థించుచున్నాను.

బ:- తల్లీ ! సంతోషకరముగా భూదానము చేయుచున్నాను. నా భూవసతిలో 1/6 వంతు 100 యెకరములు యిచ్చుచున్నాను. స్వీకరించండి !

క:- ఈ పత్రముపై సంతకము చేయండి !

బ:- (అట్లొనర్చును).

క:- కృతజ్ఞతాభి వందనాలు !

బ:- తల్లీ ! నేను నిరుపేదను. భూవసతి లేనివాడను. సహాయము చేయుటకు ఉత్సాహముగా నున్నది. ఏమి చేయవలెనో పాలుపోకున్నది.

క:- అయ్యా ! మీ చిత్తానుసారము సంపద్దానము చేయవచ్చును. మీరేమి యిచ్చినా స్వీకరింపబడును.

రా:- పది రూపాయలు మాత్ర మీయ దలంచాను.

క:- అవియే చాలును. ఈ పత్రముపై సంతకము చేయండి !

రా:- (అట్లొనర్చును).

క:- ఇంక నేను ప్రచారమునకు పోవలెను. సెలవొసంగుడు, నమస్తే !

బ + రా:- నమస్తే !

[ కమలం - సర్వోదయ మని పాడుచు నిష్క్రమించును ].

బ:- రాఘవయ్యా ! మన మాధవయ్యగారి జన్మ తరింపగలదనుటకు సందేహము లేదు.

రా:- మానవజన్మ మెత్తినందులకు సార్థకము చేసికొనుటే మానవత్వము కాదా ?

మా:- మానవత్వ మున్నచోటనే భగవంతుడు తాండవించుచుండును. సౌభాగ్యము ఓలలాడుచుండును.

[ బంగారయ్య, రాఘవయ్య నమస్కరింపగా మాధవయ్యయు నమస్కరించును. బంగారయ్య ఆసనము చూపగా మాధవయ్య కూర్చొనును ].

మాధవయ్య:- మీ యిరువురూ భూదాన, సంపద్దానములు సలుపుటచే చరితార్థులైనారు. ధన్యపురుషులు.

బ:– ఇందులకు కారణము మీరే!

మా:- భూ సంస్కరణము వల్లనే గదా పేదలకు, కూలీలకు జీవనోపాధి కలుగగలదు.

రా:- వ్యవసాయమే కదా భారతీయులకు ముఖ్య జీవనము. మన దేశములో 100 కి 70 మంది వరకు వ్యవసాయముపై ఆధారపడి యున్నాము.

మా:– కనుకనే మన ప్రభుత్వము భూవసతి గలవారి వద్ద కొన్ని యెకరములే ప్రమాణముగా నుంచి మిగిలిన భూములు పేదలకు పంచిపెట్ట దలచినది.

రా:– బాగు, బాగు.

మా:- ఇంకను సమిష్టిగా ఉమ్మడి వ్యవసాయమును రైతులు చేయుటకు ఏర్పాటులు గావింపబడు చున్నవి.

రా:– ఇందువలన కొంతవరకు వ్యయప్రయాసలు తగ్గడమే గాక ఆదాయు మభివృద్ధి పొందవచ్చు.

మా:- మన రెండవ ప్రణాళిక వ్యయము, 4,800 కోట్ల రూపాయలలో వ్యవసాయ కార్యములకు 341 కోట్ల రూపాయలు విభజింపబడినవి. వ్యవసాయోత్పత్తి 18 శాతము పెరుగుచు, 2 కోట్ల యెకరములు క్రొత్తగా సాగుకు వచ్చును.

బ:– ప్రభుత్వం వ్యవసాయ కార్యాలకు చాలా ప్రోత్సాహ మిచ్చుచున్నదే!

మా:– ఔను,

సీ॥ పరిమితి గాను భూ । వసతిని నియమించి
 మిగులు భూములు । పేదల కిడి,
అటవీ ప్రదేశమ్ము । లన్ని బంజరు లను
 విడువక సాగు గా । వించుటకును,
ఖండ ఖండములు గా । నుండెడి భాగముల్
 పెద్ద ఖండములు గా । పెంచుటకును,
వ్యవసాయ ముమ్మడి । పద్ధతి నడుపంగ
 సహకార పద్ధతి । సంఘము లిడి

తే॥గీ॥ నీటి వసతులు సమకూర్చి; । మేటి రకపు
 పరికరమ్ములు, విత్తనమ్ము । లెరువు లొసగి,
 వలయు వ్యాపార వాణిజ్య । పంటలెల్ల
 వృద్ధిగావింప పథకమ్ము । సిద్ధ పరచె;

మరియు భూసార రక్షణకొరకు తగిన ఏర్పాటులు గావింపబడినవి.

రా:- ఔనౌను. జపాను సాగువంటి క్రొత్త క్రొత్త పద్ధతులుకూడా నెలకొలిపి ఉత్పత్తిని అధికము చేయుచున్నారు.

మా:- బుల్‌డోజర్లు, ట్రాక్టర్లు మున్నగు యంత్రములతో అరణ్యములు, మెట్ట పల్లములు మున్నగునవి సమమట్టముగా చేసి సాగుకు పనికివచ్చునట్లుగా తయారుచేయుచున్నారు. దుక్కి దున్నుటకు మర నాగళ్లు మొదలైనవి వినియోగించుచున్నారు.

బ:– అయిన పశువుల అవసరమే యుండదు. మేలే!

మా:- అట్లెన్నటికీ తలంపరాదు. మానవులు, పశువులు, యంత్రములు తమతమ పనులు చేయవలెను. అట్లు చేయనిచో ఎట్లగును? ముఖ్యముగా తక్కువ మానవబలమును వినియోగించి యంత్రాలచే ఎక్కువగా కార్యాలు సాధింపవలెను. అట్లే పశువులయొక్క బలమున్నూ మనము సహాయముగా దీసికొనవలసి యున్నది.

రా:- పశుపోషణకేమేని చర్యలు తీసుకున్నారా?

మా:– పశుపోషణ, పాడి పరిశ్రమల అభివృద్ధికై 56 కోట్ల రూపాయలు కేటాయించబడినవి. పశువులు బరువులను యీడ్చుటకు, పాలు యిచ్చుటకు ఉపయోగించుచున్నవి. పాలనుండి ఉత్పత్తి యగు పదార్థముల వల్లనే భారతీయులలో అధిక సంఖ్యాకులకు మాంసకృతులు లభ్యమగుచున్నవి.

బ:– పశువులవలన మన కధికముగా లాభము కలుగుచుండుటవల్లనే ప్రభుత్వము పశుపోషణకు కావలసిన శ్రద్ధ తీసికొన్నది.

మా:– ఔను, పశుసంవర్ధనకై శ్రేష్ఠమైన కొన్ని జాతి ఎద్దులను, దున్నలను ఉపయోగింపబడుచున్నవి. మిగిలిన పశువులకు విచ్చులు తీయబడుచున్నవి. మరియు, కృత్రిమరీతిగా చూలు కట్టునట్టు చేయు పద్ధతి ప్రవేశపెట్టబడుచున్నది.

రా:– పశువుల రోగములను బాగు పరిచే పద్ధతులు కూడాగలవా?

మా:- పశువైద్యశాలలు నెలకొలపడమే గాక, గ్రామాలకు పశువైద్యులను పంపి చికిత్సలు చేయించుచున్నారు. పశుగ్రాసమునకుగూడ తగిన ఏర్పా

టులు గావించుచున్నారు. మరియు, గొఱ్ఱెలు, ఆడమేకలు మొదలగువాటినే గాక, కోళ్ల పెంపకమునకు కూడా చర్యలు తీసుకోబడినవి.

రా:- సరే. బాగానే యున్నది. — వ్యవసాయమునకు నీరే ముఖ్యాధారము గదా! నీటిపారుదల సౌకర్యాలు ఎట్లేర్పాటు చేశారు ?

మా:- నీటినిగురించి బాహుళ్యమైన ఏర్పాటులు గావింపబడినవి. జలము నదులగుండా ప్రవహించి సముద్రములో కలిసి నిరుపయోగ మగుచున్నది. అట్లు నిరుపయోగము గాకుండా నదులకు ఆనకట్లు కట్టి కావలసినంత జలమును వినియోగించుకొని మిగిలినది సముద్రమునకు విడుచుచున్నారు.

రా:- ఆనకట్లకేనా ప్రాజెక్టులందురు ?

మా:- ఔను, — మొదటి ప్రణాళిక కాలములో విరివిగా ప్రాజెక్టులు చిన్నవి, పెద్దవి నెలకొలపబడినవి.

రా:- వాటిలో కొన్ని ప్రాజెక్టులు పూర్తి కాబడలేదని తెలియుచున్నదే ?

మా:- వాటి పూర్తినిర్మాణముకొరకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో తల పెట్టబడినది. ఈ ప్రణాళికలో 380 కోట్ల రూపాయలు ఖర్చు చేయుటకు ఉద్దేశింపబడినది. 195 క్రొత్తనీటి ప్రాజెక్టులు చేర్చబడినవి. ఇందు పెద్దరకము ప్రాజెక్టులు 10, మధ్యరకము ప్రాజెక్టులు 8, మిగతవి చిన్నరకము ప్రాజెక్టులుగా చేర్చబడినవి.

రా:- రెండు ప్రణాళికల కాలములోను బాహుళ్యముగానే ప్రాజెక్టులను తలపోశారు.

మా:- మరియు, మొదటి ప్రణాళిక కాలములో 5,830 గొట్టపుబావులు నిర్మించుటకు తలపెట్టబడినది. వీనిలో చాలభాగం పూర్తికాబడినవి. ద్వితీయ ప్రణాళిక కాలములోకూడా 20 కోట్ల రూపాయలు ఖర్చుతో ఆదనముగా 3,580 గొట్టపుబావులు నిర్మించవలెనని, వీనిద్వారా 9,16,000 యెకరాలకు నీటిపారుదల సౌకర్యం కలిగించాలని ప్రభుత్వము తలంచినది.

రా:- ఆహా! మన భూములు బంగారు భూములు చేయడానికే ప్రభుత్వము తలపోసినది.

మా:- ఆ మరేమనుకొంటివి? జలశక్తిద్వారా విద్యుత్తు కూడా అభివృద్ధిజేసి పట్టణములకు, గ్రామసీమలకు, కొన్నిరకముల పరిశ్రమలకు సరఫరా చేయుటకు తలంపబడినది.

రా:- విద్యుత్తుకూడానా ?

మా:- ఔను, జలవిద్యుచ్ఛక్తియేగాక, బొగ్గుద్వారా కూడా మనకు విద్యుచ్ఛక్తి లభించుచున్నది. ఈ రెండు సాధనసంపత్తులద్వారా మనకు కావలసినంత విద్యుత్తు లభ్యమవుచున్నది.

రా:- ఇంక యిటువంటి విద్యుత్తు లభిస్తుండడమువల్ల దీపాలకు కొరతలేదు.

మా:- దీపాలకేగాక పెక్కు కార్యాలకు విద్యుదుపయోగమెంతైనా గలదు. ఇంకొకతూరి ప్రసంగింతము. నేటికి చాలింతము. వేళయైనది.

బ:- మాధవయ్యగారూ! తరచుగా మీరు దయచేసి మా సంశయములను తీర్చవలసినదని కోరిక.

మా:- అట్లే !

తెర వ్రాలును

(సశేషము)

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౯౬

సాకేత పురమందు - శరదిందు చంద్రికా
ధవళంబు మించు, సౌధంబులోన
నగరు ధూపముల చేఁ బొగలునిండిన, మంట
పంబొందు చెలువారు డంబుమీఱి
కర్పూరదీప ప్రకాశమానంబైన
యామంటపములోన - నంగదుండు
సుగ్రీవుఁడు,పవనజుఁడు, లక్ష్మణుఁడునిన్ను
సేవింప, శ్రీరామ ! సీతతోడ
ముఱియుచున్నావు ; రఘుపతీ మోహ
నాంగ !
శ్యామలాకార ! చింతింతు సతమునిన్ను
వరద ! లీలా మనుజరూప ! ప్రణుతి
గొనుము ;
రక్షసేయుము; రామచంద్రా ముకుంద ?

౯౭

తండ్రి రాముండు, తల్లికోదండధారి
ఇష్టమిత్రుండు రాముండు, కష్టములను
బాపు చుట్టంబు రాముఁడు ; భవ్యగురుఁడు
రామచంద్రుండు, దేవుండు రామవిభుఁడు
రామవిభుఁడక్క-నన్యుల నామములను
స్మరణనొనరింప ; కాపాడుమా - బిరాన

౯౮

ఎట్టిదయతోడ, మునుల, లాలించినావో ?
ఎట్టి కరుణతో, సుగ్రీవు నేలినావొ !
ఎట్టిదయ, విభీషణునిఁ జేబట్టినావో ?
అట్టికరుణతో, ననుఁబ్రోవుమయ్య రామ!

౯౯

ఓ! దయానిధి ! రాఘవా! రావోయి రామ!
నాదు పాపంబు లెల్లఁబోనాడఁజేసి
రక్తిసేవింప ధృఢమైన భక్తినిమ్మ :
దాన, నాయభీష్టము దీరదా ? ముకుంద!

౧౦౦

నిత్యుఁడక్షీణ బాణ తూణీరుఁడొక్క-
బెట్టఁబడినట్టి ధనువుఁజేఁబట్టువాఁడు
రావణాంతకుఁడర్క-కులావతంసుఁ
డనఘుఁడా రామచంద్రుఁడాతనిఁదలంతు
నతఁడె నా తల్లి దండ్రి సుహృత్తఁడె, స్నేహి
తుండు, చుట్టంబునతఁడె! యతండెగురువు!
గోష్ఠియునతండె ; యతని సత్కీర్తితోడఁ
ప్రార్థనమొనర్తు సతతంబు భక్తితోడ

౧౦౧

మేఘగంభీర శబ్దంబు మేటిగాఁగ
వచ్చు కోదండమును బూని - వాయువేగ
ధాటిమించెడు నట్టియస్త్రంబుఁదొడిగి
రాక్షసశ్రేష్ఠులను జంపిరణమునందు
సాధుజనముల కభయప్రసాద మొసఁగి
సానుజుండయి శ్రీరామ ! సకల భూత
కోటిరక్షించుచున్నావు; కువలయేశ !
ఇంక భయమేమినాకు ? శ్రీయునకు లేశ !

౧౦౨

కౌసల్యా గర్భముక్తాఫలంబై, నీవు
జన్మించి, దశరథసార్వభౌముఁ
డక్కు-అనిముఁ బెంప - నవనిజయనుతిగ
నాలింగన మొనర్చి, లీలతోడ
శాఖోపశాఖలుగా - ఖగమార్గంబు
నావరించి, పెఱిగినావు; కల్ప
తరువుగా, నీదు సోదరులు, మహాశాఖ
లై, దట్టముగ ఛాయలందఁ జేయ

రాక్షసుల వేడి తగ్గె; శ్రీరామ చంద్ర
కల్పకంబీవు మాకొక్కొ-అల్పమనక
స్వాదురసముల నిండిన ఫలములొసఁగి
జిహ్వరుచులను మాన్పవే! శ్రీవిలాస!

౧౦౩

వేదాంతములకెల్ల - విఖ్యాత రత్నంబు
జననుతుండైనట్టి సార్వభౌమ
రత్నంబు! భూసుతరత్నంబు; భువనేక
రత్నంబు; రఘుకుల రత్నమరయ
భక్తకోటులకెల్ల పావనరత్నంబు
రాజులలో ముఖ్యరత్నమవని
శ్రీరామ రత్నమా శ్రితుల మందారంబు
జానకీమోదంబు - సమ్మతంబు

రామరత్నరహస్యంబు - రసికవరులు
భక్తజనము లెఱుంగగా వలయుఁ గాక
పరులెఱుంగ శక్యము కాదు భక్తవరద!
రామరత్నమ? నాకిమ్ము రక్షణంబు

౧౦౪

ఆశ్రితమందార! ఆనందసంచార!
అఖిలగుణోదార! అప్రమేయ!
పుండరీకాక్ష! కోదండ తూణీరముల్
ధరియించినట్టి భూధర శరీర!
కల్యాణ గుణధామ! కారుణ్యసీమ! వి
ఖ్యాతనామ! మునీంద్రపూతనామ!
సీతాముఖాబ్జ సంజాత సుధాస్వాద
న మొనర్చు భృంగమైనావు; రామ!
మాకుఁ గొదువ కలదె? ప్రాకటశుభముల
నిమ్ము; అభయమిమ్ము; కమ్మగాఁగ
నీవె గతియటంచు - నిక్కంబుగా నమ్మి
నాము; రఘుకులేంద్ర! రామభద్ర

(సశేషము)

---

తెలుగు మాస్టారు:- తెలుగు పేపరు ఎలా గుందిరా?
విద్యార్థులు:- చాలా తేలిగ్గా వుందండి?
తె. మా:- అంత తేలిగ్గా వుందా?
విద్యార్థులు:- అబ్బె అరతులమేనండీ!

◆ ◆ ◆

ఒకాయన:- రేపు నాకివ్వవలసిన డబ్బివ్వకపోతే అణా హైకోర్టులో కక్కిస్తాను తెల్సా
మరొకాయన:- బాబ్బాబూ! నీకు పుణ్యముంటుంది. నాకు చాలా అవసరం. ఆ కక్కించేవి అదనంగా కక్కిద్దూ!

ఎస్. ఎమ్. వాడ్రేవ్

---




# సాహస వీరులు

శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు

(గతసంచిక తరువాయి)

ఇంతలో స్వరూప అక్కడికివచ్చింది. హరకుమార్ శివబంటు కథంతా చెప్పాడు. ఆమె ఆశ్చర్య పోయింది.

"అవునమ్మ ఆ మందిరంలో ఒక రాకుమార్తెను బంధించివుంచాడు ఆమె పేరు రమణి అట. ఉజ్జయినీ నగర రాకుమార్తె అని చెప్పింది." అన్నాను.

"ఆమె రమణియా! ఉజ్జయినీ నగరమా! ఆమె నా చెల్లెలు! ఇంకా సందేహమెందుకు? అని ఆలా చిక్కపడిపోయింది. నేనిలా చిక్కపడిపోయాను" అంది కన్నీళ్ళతో.

"విచారించకండమ్మా! అట్టహాసుని ప్రాణరహస్యం తెలుసుకున్నాను. ఈ రాక్షసుని ప్రాణరహస్యంకూడా కనుక్కోండి. దాంతో ఇద్దరి బెరా వదిలిపోతుంది" అన్నాను.

"ఈరాక్షసుని ప్రాణవిషయం ఎప్పుడో తెలుసుకున్నాను" అన్నాడు హరకుమార్

"అయితే ఇంకా జాగెందుకు! మీరటు వెళ్ళండి నేనటు వెళతాను" అన్నాడు.

"యువరాజు! నీ దగ్గరున్న గుళిక నీకు చాల వుపయోగపడుతుంది, అనేక రూపాలుపొందవచ్చు! అదృశ్యమూ కావచ్చు! జాగ్రత్త" అని చెప్పింది స్వరూప.

ఇద్దరూ చెరొక దారిన విడిపోతుండగా స్వరూప శివబంటును పిలిచింది. "అక్కడ రాక్షసులుంటారే! నీవెలా జయింపగలుగుతావ్ ?" అనిఅడిగింది. "ఆభయం మీకేం అక్ఖర్లేదు తల్లీ! రాక్షసుడు నానటన అంతా నిజమేనని నమ్మి అదృశ్యగుళిక ఇచ్చాడు. వస్తా"నని వెళ్ళిపోయాడు.

♦ ♦ ♦

స్వరూప వంటచేసి ఇద్దరికీ పీటవేసింది. ఇద్దరూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ తింటున్నారు. "నాతోబాటు ఎత్తుకొచ్చినపిల్లేనా ఇది!" అని అడిగాడు అట్టహాసుడు.

"అవున్రా ఇది ఇప్పుడిప్పుడే దారిన పడుతూంది." అన్నాడు.

"నా చిలకకూడా పదిహేను రోజులు గడువు పెట్టింది. ఆ తర్వాత మా వివాహం" విలాసాలు మెలివేశాడు.

"తొందర్లోనే అవుతుందిలే మీ వివాహం!" అని మెటికలువిరిచి ముసిముసినవ్వులు నవ్వుకొంది.

అన్నం కలుపుకోబోతుండగా ఇద్దరురాక్షసులు వెనక్కు విరుచుకుపడ్డారు. హరకుమార్ నల్లరాయిని నేలకేసి కొట్టాడు, ముక్కలయింది. దొప్పతలరాక్షసుని తలముక్కలు ముక్కలయి క్రిందపడి ప్రాణాలు వదిలాడు. శివబంటు మొదటి చిలకనుచంపగానే వాడిటు కదల్లేకపోయాడు. "ఆరిమీదుంపలు తెగ నమ్మించి ఎంతపనిచేశారురా" అని పళ్ళుపటపట కొరికాడు. అట్టహాసుడు.

"కనపడిన ఆడవాళ్ళనల్లా ఎత్తుకువచ్చి బలవంతం చేయడం అనుకున్నావా! అనుభవించు నీ పాపానికి ఫలితం!" అని రెండవచిలకను చంపాడు. అట్టహాసుడు ప్రాణాలను వదిలాడు.

"పీడవదిలి పోయింది స్వరూపా." అన్నాడు హరకుమార్.

"మరియింకా జాగెందుకు పదండి అట్టాగేనండి గుహకు వెళదాం" అన్నాడు.
శివబంటు రాక్షసునిదగ్గర విజయకంకం తీసుకొన్నాడు.

పది నిముషాల్లో రమణి దగ్గరవాలారు.

రమణి అక్కను కావలించుకుని బావురుమంది.

అక్కడవున్న ధన జాలాన్నంతా తీసికొని ఉజ్జయినీ నగరం వచ్చారు. శంకరప్రభు కూతుండ్రను కౌగలించుకొని ఆనంద భాష్పాలురాల్చాడు. మహారాజా ఆనందానికి అంతేలేదు. శంకర ప్రభువెంతో ఆనందంతో ఆకాశమంత పందిరి వేయించి రంగు రంగు వైభవంగా స్వరూపా రమణులను హరకుమార్ నకిచ్చి వివాహంచేశాడు.

హరకుమార్ కొంతకాలంపాటు ఇద్దరిభార్యలతోనూ అమర సుఖాలననుభవించాడు. ఒకసారి మామగారి దగ్గరకువచ్చి "మాకు ఇంకా దేశాటనం చెయ్యాలనివుంది! అనుజ్ఞ యిప్పించండి!" అని అడిగాడు.

"ఇంకా దేశాటనమెందుకు నాయినా! హాయిగా ఇక్కడేవుండండి." అన్నాడు రాజా కాని హరకుమార్ తనపట్టును విడవలేదు. మామగారు సరే అన్నారు. అయిష్టంగా ఇద్దరు భార్యలూ భర్తను విడువలేక విడువలేక విడిచారు. నేను ఎంతో త్వరలో తిరిగి మిమ్మల్ని చేరుకుంటాను. సరేనా అని భార్యల వద్ద మామగారివద్ద సెలవుతీసుకున్నాడు.
హరకుమార్ శివబంటు గుఱ్ఱాలనెక్కి పరుగులు తీశారు.

5

అలావాళ్లిద్దరూ ఉజ్జయినీ నగరందాటి చాలా దూరం వచ్చేశారు. అలాగుర్రాలను పరుగెత్తించుకుంటూ చిట్టచివరకు ఒకకొండ దాపునకువచ్చారు. ఎండతీవ్రంగా మండిపోతుంది. కాస్సేపు కొండ గుహాలో విశ్రాంతి తీసుకుందాం అని చేరువ గుహలోకి వెళ్లారు. ఆశ్చర్యం అత్యద్భుతాశ్చర్యంగా గాలి వీచి వింత దృశ్యంచూశారు. ఆ గుహాలో ఒకమూలగా పెద్దసొరంగంవుంది, పరీక్షించి చూచారు. కాని ఆ ద్వారం పొడుగు అంతూపొంతూ లేకుండాపోయింది. "యువరాజా! చూడబోతే యీ సొరంగం చాలా చాలాదూరం పోయ్యేట్లుందే!" అన్నాడు శివబంటు.

"నాకూ అలానే కనిపిస్తుందోయ్! రాజవంశంలో పుట్టి వీరాధి వీరుడనని పేరుపొందిన నేను ఈ ద్వారం అంతేమిటో తేలుస్తాను. దీని రహస్యమేమిటో కనిపెట్టి తీరాల్సిందే. శివబంటూ నీ విక్కడే వుండు నేనులోపలికెళ్లి దీనిరహస్యం ఛేదించుకు వస్తాను." అన్నాడు.

"యువరాజా! నేనులేకుండానా"

"ఫర్వాలేదు నేను వేగిరంవచ్చేస్తాగా అంతదనుకా జాగ్రత్తగావుండు!" అని చెప్పి ఆ సొరంగంలోదూరి మాయమయ్యాడు యువరాజా.

"ఏంమనిషో ఏంలోకమో! ఏదైనా వింతకనిపిస్తే దాని అంతు తీర్చిందాకా నిద్ర పోడు" అని గొణుక్కుంటూ నడుంవాల్చాడు శివబంటు. గుర్రాలు పరస్పరం చూసుకొని తెలిసీతెలియని భావతో సకిలించుకున్నాయ్.

అలా హరకుమార్ ద్వారం వెంటేపడిపోసాగాడు, ఆ సొరంగం అంతుతేలలేదు. పోయినకొలది ఇంకా సాగిపోతూనే వుందికాని తుదికనిపించటంలేదు. హరకుమార్ ఓపిగ్గా నడకసాగించాడు. ఇంతలో వున్నట్లుండి ద్వారం రెండువైపులకు చీలిపోయింది. ఎటు వెళ్లటమా అనే సందిగ్ధావస్థలో పడిపోయాడు. దైవాన్ని మనసులో తలుచుకొని నైరుతిదిక్కుగా సాగిపోయే ద్వారంగుండా నడక సాగించాడు. పోగా పోగా కట్టకడకు అంతుచిక్కింది. ఆ ద్వారం ఒక సరస్సుదగ్గర ఆగిపోయింది. ఈ విచిత్రసంఘటనకు వింత పోతూ సరస్సులోకి తొంగిచూశాడు. ఇంతలో వున్నట్లుండి "రక్షించండి! రక్షించండి!" అని ఆ క్రందనవినిపించింది. ఆశ్చర్యంగా నలువైపులా పరికించాడు. ఒకయువతి నీటిలో మునిగిపోతూ చేతులుపైకి సాచింది. హరకుమార్ ముందు వెనకులాలోచించకుండా ఆయువతినిరక్షించేటందుకై సరస్సులోకిదూకాడు. ఇంతకుముందు కనిపించిన ఆ రెండు చేతులు అతడిని తక్షణమందే నదీ అంతర్భాగానికి లాక్కుపోయినాయ్

(సశేషము)

# బుద్ధిబలము

శ్రీ మురమళ్ల వెంకటేశ్వరరావు

——(౧)——

అది మధ్యాహ్నపు వేళ. ఎండ వేడిమి తీక్షణముగా నుండెను. ఒక బాటసారి గుఱ్ఱముపై ప్రయాణము చేయుచు, అచట సమీపములో నున్న మఱ్ఱి వృక్షమునకు తన గుఱ్ఱమును కట్టివైచి, దానినీడను విశ్రమింపబోయెను.

సరిగా అదేసమయమున ఒక వర్తకుడు అచ్చటకు వచ్చి, తన గుఱ్ఱమును కూడ అదే మఱ్ఱి వృక్షమునకు కట్టబోవుచుండెను.

"అయ్యా! దయచేసి మీ గుఱ్ఱమును, నా గుఱ్ఱము ప్రక్కనే కట్టకండి, అది క్రూర స్వభావముకలది. దానికి తోటి గుఱ్ఱముల పొత్తుగిట్టదు. మీగుఱ్ఱమును బాధించి, చంపినను చంపవచ్చును. దయచేసి మీ గుఱ్ఱమును మరియొక చెట్టుకుకట్టుకొనుడని ప్రార్థించుచున్నాను" అని ఆ బాటసారి తన గుఱ్ఱముయొక్క నైజమును ఆ వర్తకునితో చెప్పెను. ఆ వర్తకుడు ధనవంతుడగుటచే మిక్కిలిగర్వి. ఇతరులు చెప్పినట్లు చేయుటకిష్టపడలేదు. అతడు గర్వముతో, "నా గుఱ్ఱమును నాకిష్టము వచ్చినచోట కట్టుకొందును. అవసరమైనచో నీ గుఱ్ఱమునే మరియొక చెట్టుకు కట్టుకొనుము." అని సమాధానమిచ్చెను. ఆ బాటసారి మరల అతని గుఱ్ఱమును అచ్చటకట్టవద్దని చెప్పెను. కాని ఆ వర్తకుడు ఆ బాటసారి మాటలను లెక్కింపక, తనగుఱ్ఱమును ఆ చెట్టుకే కట్టివైచి, ఆ చెట్టునీడను విశ్రమించెను. కొద్దిసేపటికి వారు గుఱ్ఱముల సకిలింపులు, అరుపులువిని, నిద్రనుండి మేల్కొని చూడగా ఆ రెండు గుఱ్ఱములు రోషముతో వాటి ముందుకాళ్ళతో తన్నుకొనుచు పోరాడుకొనుచుండెను. వారిద్దరూ ఆ గుఱ్ఱములను విడదీయుటకు దగ్గరకేగిరి. వాటిని విడదీయుట వారికి సాధ్యము కాకుండెను. తుట్టతుదకు వర్తకుని గుఱ్ఱము చనిపోయెను.

ఆ వర్తకుడు కోపము చెంది, బాటసారిని న్యాయాధికారివద్దకు తీసుకువెళ్లి, తన గుఱ్ఱమును ఆ బాటసారియొక్క గుఱ్ఱము చంపినదని, తనకు తగిన ప్రతిఫలము ఆ బాటసారినుండి ఇప్పించమనియు ఫిర్యాదు చేసెను.

ఆ న్యాయాధికారి వర్తకుడు చెప్పినదంతయువిని, "ఈవర్తకుడు చెప్పినదంతయు నిజమేనా?" అని బాటసారిని ప్రశ్నించెను. కాని ఆ బాటసారి ప్రత్యుత్తరమీయక అట్లే నిల్చుండెను. ఆ బాటసారి చెవిటివాడని న్యాయాధికారితలంచి, ఆప్రశ్ననే మరల బిగ్గరగా అడిగెను. ఈ సారి కూడ బాటసారి ఒక్క ముక్కకూడ పలుకలేదు. న్యాయాధికారి ఆబాటసారి మౌనమును చూచి మూగవాడని తలంచి, "ఇతడు మూగవానివలె, చెవిటివానివలెనున్నాడు; నేనెట్లు తీర్పుచెప్పగలను?" అని వర్తకునితోననెను. ఆన్యాయాధికారి మాటలను విని వర్తకుడు, "అయ్యా! ఇతడు మనిద్దరి కంటెకూడ బాగుగా మాట్లాడగలడు.

అతడు నిజముగా చెవిటివాడు కాడు. అదంతా అతని నటనమాత్రమే. అతడు నాతో నాగుఱ్ఱమును చెట్టుకు కట్టివేయునపుడు మాట్లాడినాడు'' అని చెప్పెను. ఆతని మాటలను విని న్యాయాధికారి ఆశ్చర్యముతో, ''నీతో నిజముగా మాట్లాడెనా?'' అని ప్రశ్నించెను. 'అతడు నాతో మాట్లాడిన మాట నిజమే ''నని వర్తకుడు సమాధానమిచ్చెను. ''ఆతడు నీతో ఏమని చెప్పెను?'' అని న్యాయాధికారి ప్రశ్నించగా, వర్తకుడు, ''ఆతడు నాతో 'దయచేసి మీగుఱ్ఱమును నా గుఱ్ఱము ప్రక్కనే కట్టకండి. అది క్రూరస్వభావముకలది. మీగుఱ్ఱమును చంపినను చంపవచ్చును. దయచేసి మీ గుఱ్ఱమును మరియొక చెట్టుకుకట్టుకొనుడు' అని చెప్పినాడు.'' అని సమాధానమిచ్చెను.

''అతడు నీతో తనగుఱ్ఱముయొక్క స్వభావమును చెప్పినను నీవు లక్ష్యపెట్టకపోవుటచే నీగుఱ్ఱము చనిపోయినది.'' అని న్యాయాధికారి చెప్పి, బాటసారి వైపు చూచి, ''నీగుఱ్ఱముయొక్క స్వభావమును ఈ వర్తకునితో నిజముగా చెప్పితివా?'' అని ఆతడు మూగవాడనియు, చెవిటివాడనియు మరచి ప్రశ్నించెను. ఈ సారి బాటసారి తన మౌనమును భంగముచేసెను. ''నిజమే నండీ!'' అని బాటసారి సమాధానమిచ్చెను. ఆ న్యాయాధికారి ఆశ్చర్యముతో, ''నీవు మూగవానివలె, చెవిటివానివలె ఎందులకు ప్రవర్తించితివి?'' అని ప్రశ్నించెను. ''నేనట్లు ప్రవర్తించినందుకు దయచేసి నన్ను క్షమింపమని కోరుచున్నాను. మీరు నన్ను అడిగిన ప్రశ్నలకు నేను సమాధానము చెప్పినచో, ఈ వర్తకుడు నేను మీతో చెప్పినవన్నియు అబద్ధములని చెప్పియుండెడివాడు. అప్పుడు మా ఇద్దరిలో ఎవరు నిజము చెప్పినది, ఎవరు అబద్ధము చెప్పినది మీరు తెలుసుకొనలేరు. నేను మౌనముగానుండి అతని నొక్కనినే మాట్లాడనిచ్చినచో, ఆతని నోటిమీదుగనే నిజము బయటపడునని తెలిసి అట్లు ప్రవర్తించితిని,'' అని బాటసారి తాను పన్నిన ఉపాయమును న్యాయాధికారితో చెప్పెను. న్యాయాధికారి ఆ బాటసారి బుద్ధిబలమునకు మెచ్చుకొనెను. బాటసారిపై అన్యాయముగా నేరము మోపినందుకు వర్తకుని శిక్షించెను.



రెండు పిల్లల కథలు —

# బంగారు కాయ

—(౦)—

ఒకానొకప్పుడు మార్డోవిజన్ గ్రామంలో ఒక కమ్మరి నివసిస్తూండేవాడు. అతనూ అతనిభార్య చక్కగా హాయిగా జీవిస్తూండేవారు. కాని వారి కొక్కటే విచారం - అది పిల్లలు లేకపోవటం.

ఆకురాలు కాలంలో, ఒక నాటిరాత్రి కమ్మరి భార్య కలగన్నది. కీకారణ్యంలో ఒక అక్రోటు చెట్టుకొమ్మ క్రిందకు వాలివుండటం ఆవిడ చూసింది. ఈ చిత్రమైనకల వరుసగా మూడు రాత్రులు ఆవిడకు రావడంతో ఆమె భర్తను అడిగింది 'అడవిలోంచి ఆ బంగారపు కాయను తెచ్చిపెట్టండి నాకు' అని.

కమ్మరి బయల్దేరాడు. అతడు తిరిగి తిరిగి ఆఖరికి

ఒక దట్టమైనపొదలో అక్రోటు చెట్టుకొమ్మను కనుక్కున్నాడు. ఈ కొమ్మకు ఆకాయ వున్నది, దాని పెంకు బంగారపుదే.

కమ్మరి యీ బంగారపు కాయను పగులగొట్టగానే, అప్పుడా ప్రక్కచెట్టుమీదే వున్న ఒకవుడత కోపంగా అరిచింది. కమ్మరితో యిలా మాట్లాడింది :

'టోక్ - టోక్ ! అంటరాని నాకాయల్ని నువ్వెంత ధైర్యంగా పగలగొట్టావు ?'

ఆ వుడతేమీ సామాన్యమైన వుడత కాదు. దాని వంటిమీద బొచ్చు మంచులాగ తెల్లగా వుంటుంది. దాని మెడచుట్టూ బంగారపు కాయలతో చేసిన గొలుసు వున్నది.

'ఓ వనరాణీ! నామీద కోపగించకు' అన్నాడు కమ్మరి నమ్రతతో. 'ఈ కాయలు ముట్టుకోకూడదని నాకు తెలియదు. జబ్బుగా వున్న నా భార్య అడిగింది కదా అని బహుమానంగా పట్టుకెళ్తున్నాను. ఇదిగో నీకాయ నువ్వే తీసుకో.'

'నువ్వు నిజం చెప్పావు కనుక యిదిగో యీ బంగారుకాయ నీకు బహుమానం' అంది తెల్లవుడుత.

'లోపలి పప్పుతిని పెంకుల్ని దాచుకోమని నీ భార్యకు చెప్పు. నీ కిద్దరు కొడుకులు పుడ్తారు. వాళ్ళకి యిరవై యేళ్ళొచ్చేసరికి చెరొకరికీ చెరోపెంకూ యియ్యి. అడివిలోకి వాళ్ళు తప్పకుండా రావాలి. వడ్రంగిపిట్ట పొడుచుకుతినే చప్పుడుకాగానే ఆ కాయపెంకుల్ని నేలమీదకు జారవిడవమని చెప్పు. తరువాత వారివారి కర్మని వారే యెంచుకుంటారు.'

ఆ తెల్లవుడుత చెప్పినట్లుగా అంతా అల్లాగే జరిగింది. వసంతంలో కమ్మరిభార్య నీళ్ళాడి కవలపిల్లల్ని కన్నది. ఇద్దరూ మగపిల్లలు. ఒకడికి నల్లటి మెరిసే కళ్ళు, రెండవవాడి కళ్ళుమాత్రం నీలం.

అన్నదమ్ములిద్దరూ పెరిగి పెద్దవారయ్యారు. చక్కగా బలంగా వుత్సాహవంతులై వున్నారు. నీలికళ్ళ అబ్బాయినే అంతా ప్రేమించేవారు. ఆ నల్లకళ్ళ అబ్బాయిని అంతా తప్పించేసుకునేవారు. ఎందుకనంటే అతనిలో దురాశా, గర్వమూ చాలా యెక్కువ.

ఈ కవలలిద్దరికీ యిరవై యేళ్ళు వచ్చేసరికి వారిద్దకీ చెరో బంగారుడిప్పా తండ్రి యిచ్చాడు. అవి పుచ్చుకుని అన్నదమ్ములిద్దరూ వారివారి అదృష్టాల్ని పరీక్షించుకుందుకు అడవిలోకి వెళ్ళారు.

వడ్రంగిపిట్ట చెట్టును పొడుస్తున్న చప్పుడుకాగానే వారిద్దరూ ఆ బంగారు డిప్పలను క్రింద పారేశారు. పారేసీపారెయ్యటంతో వారిద్దరూ ఒక పెద్దజలపాతం ప్రక్కన వున్నారు.

ఎదురుగుండా చెట్టుకొమ్మమీద కూర్చునివున్న వుడతను వారు చూశారు. ఆ క్రిందను చెట్టుమొదట్లో రెండు కాయలున్నాయి.

'మీకు కావలసిన కాయను ఎంచుకోండి' అంది తెల్లవుడత 'తొందరపడకండి. బాగా ఆలోచించి మరీతీసుకోండి. మీ అదృష్టం అందులో వుంది'.

ఆ అన్నదమ్ములలో నల్లకళ్ళ అతను మరింక ఆలోచించనుకూడా లేదు, చప్పున అందులో తళతళా మెరుస్తున్న కాయను తీసేసుకున్నాడు. తీసుకునేప్పుడు తన సోదరుడితో 'ఇది నాది సుమా - దీన్ని నిన్ను తీసుకోనివ్వను' అన్నట్లు చురుగ్గా చూశాడు. 'పరవాలేదు, దానికోసం నేనేం పేచీ పెట్టబోవటంలేదు' అన్నాడు నీలికళ్ళతను. అదీగాక పైకి తళతళా మెరుస్తోంది సరే - లోపలేమివుంటుందో ఎవరికి తెలుసు. నాది సరైనకాయ'.

'సరే వాటిని యిప్పుడు పగలగొట్టండి' అంది తెల్లవుడత. 'మీకెవరికైనా అసంతృప్తికరంగా వుంటే అందుకు మీరే నిందించుకోవాలి మిమ్మల్ని'.

అనేసి తెల్లవుడుత తన కుచ్చుతోకను ఝళిపించి అడివిలోకి తుర్రుమని మాయమైపోయింది.

నల్లకళ్ళవాడు ముందస్తిగా తనకాయను పగులగొట్టాడు.

భూమిలోంచి పైకివచ్చి నిల్చినట్లుగా ఒక నల్లటి గుఱ్ఱం ముందుకొచ్చి నిలబడింది. దాని జీనుకి బంగారంతో అల్లిన దుస్తులు, బంగారపు పిడితోవున్న కత్తి కట్టబడి వున్నాయి.

ఇహ అతడి సంతోషం పట్టశక్యంగాలేదు. 'ఈ కత్తితో నేను బంగారాన్ని కొల్లలుగా కొట్టుకొస్తాను' అని 'భయ్యా నీ అదృష్టం యెల్లాగుందిరా?' అని రెండవవాడి నడిగాడు.

నీలికళ్ళతను తనకాయను పగులగొట్టాడు. అతని కళ్ళెదుట మామూలుపనులుచేసే గుఱ్ఱం ప్రత్యక్ష

మయింది. దానిమూపున ఒకబస్తా వ్రేలాడుతోంది. అందులో సింధూరపు చెట్టుగింజలున్నాయి నిండుగా.

నల్లవాడు గభీమని ఎక్కి గుఱ్ఱాన్ని తోలుకు పోయాడు.

నీలికళ్ళతను 'నేనూ స్వారీచేసుకుంటూ వెళ్తాను. వెళ్లి ప్రజలు ఎల్లా జీవిస్తుంటారో చూస్తాను.'

ఒకరోజల్లా అడవుల్ని దాటాడు. రెండురోజులు మైదానాలమీదుగా వెళ్లాడు. మూడవరోజు రాత్రి తలదాచుకుందుకు ఒక గ్రామంలో ఆగాడు.

'దయచేసి అట్టే యేమీ ఆశించకండి బాబూ - మాదగ్గరేంలేదు మీకివ్వటానికి. ఎంచేతనంటే మా పొలాలన్నీ ఒక బందిపోటుదొంగ దోచుకుపోతున్నాడు' అని అన్నాడొక గ్రామీణుడు.

'ఐతే మీరెందుకు పట్టుకోరు దొంగని?' అన్నాడు నీలికళ్లతను.

'ఎల్లా _ అదేం మనిషి గనుక? అగ్నిభరటాలాంటి గాలి' _ ఆ రాత్రికి యింటి ఆవరణలో నీలికళ్లతను మకాం వేశాడు, తలక్రింద సింధూరవృక్షపు గింజలున్న సంచీని పెట్టుకుని.

పడుకోగానే ఆ గింజలు గలగల్లాడుతూ చప్పుడుచెయ్యటం మొదలెట్టాయి.

'మమ్మల్ని పాతు, మమ్మల్ని పాతు' అని గొణిగాయి. 'మేం పచ్చటిగోడలా పెరిగి అగ్నిభరాటాలాటి గాలి రకుండా అడ్డు నిలుస్తాము' అనికూడా అన్నాయి.

ఉదయం లేస్తూనే నీలికళ్లతను ఆ గ్రామీణుడితో చెప్పాడు, 'భయ్యా, నేను నీతో వుండిపోయి యిక్కడ్నే జీవితం గడపాలనుకుంటున్నాను. బహుశా మన యిద్దరం కలిస్తే యీ భీకరమైన గాలిని యేదోవిధంగా అణచలేకపోము.'

తరువాత నీలికళ్లతను, ఒకసంవత్సరం రెండు సంవత్సరాలు కాదు, చాలా కాలం అక్కడ్నే వుండిపోయాడు.

అతడికి తలకూడా నెరిసింది. అప్పటికి అతడు నాటిన విత్తనాలలోంచి మొలకెత్తిన చెట్లు పెరిగి ఆకాశాన్నంటుతున్నాయి.

ఆ భయంకరమైనగాలి అణిగిపోయింది. గోధుమ వొత్తుగా పెరిగింది. ఏడాదికేడాది బాగా పొడుగు సాగిందికూడా.

ఆ బంగారువన్నె గోధుమకంకులను చేలమీద చూసి నీలికళ్లతను 'ఇదే నా బంగారం, యిక్కడే దొరికింది. అరేయ్ భయ్యా నువ్వేం చేస్తున్నావో గదా?'

ఒకరోజు వోయింటి ప్రక్కనుంచి పోతూంటే ఒక పిల్లవాడు కాయపెంకులతో ఆడుకొంటూండటం చూశాడు. సగండిప్ప ఇనుమూ తతిమ్మా సగం బంగారమూను,

'ఈ పెంకు నీకెక్కడ దొరికింది?' అన్నాడు నీలికళ్లతను.

'మా నాన్న యుద్ధంలోంచి తిరిగివచ్చినప్పుడు దీన్ని తెచ్చాడు?'

తండ్రి వచ్చి యింకా యిలా చెప్పాడు —

'ఒకసేనాని మన్మల్ని యెదుర్కొన్నాడు _ వాడు మా భూముల్ని సర్వనాశనం చేశాడు కాని వాడిసేనల్ని చివరకు ప్రాణాల్ని పోగొట్టుకున్నాడు కూడా. అతడ్ని భూస్థాపితం చేస్తున్నప్పుడు యీ కాయపెంకు అతడి దుస్తుల్లోంచి జారిపడింది.'

'ఆ సేనాని పేరేమిటి?' అన్నాడు నీలికళ్లతను.

'జ్ఞాపకంలేదు _ ఏమైనా అది అంత జ్ఞాపకం పెట్టుకోతగిన పేరు కాదు' అన్నాడు తండ్రి.

అదీ ఆ రెండవ సోదరుడి సంగతి. కాని యీ నీలికళ్లతడి స్మృతిమాత్రం చిరకాలం వుండిపోయింది.



# రెండు తలల కుక్క

శ్రీ ఎన్. త్యాగిన్, ఎమ్.ఎస్‌సి.

**అవయవ పునరుద్ధరణ శస్త్రవైద్యంలో మహత్తర విజయాలను సాధించిన సోవియట్ శాస్త్రజ్ఞుల సృష్టి......**



అవయవాల పునరుద్ధరణ వైద్యంలో సోవియట్ వైద్యులు మహత్తర విజయాలను సాధించారు. రష్యన్ విజ్ఞాన శాస్త్రవేత్తలలో ఎ. క్యులబ్‌కో మొట్టమొదటగా 1902 లో అవయవాల పునరుద్ధరణ వైద్యంలో కృషిని ప్రారంభించారు. శరీర మరణానంతరంగూడా గుండె 27 గంటలపాటు పనిచేయడానికి అవకాశం ఉన్నదని ఆయన తన పరిశోధనలద్వారా రుజువు చేసారు. సోవియట్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఎస్. ఆంద్రియేవ్, ఎస్. బ్ర్యుఖొనెంకోలు మానవుని మరణానంతరం 96-112 గంటలకు గుండెను పునరుద్ధరించగలిగారు.

ఈనాడు సోవియట్ దేశంలో అవయవాల పునరుద్ధరణ శస్త్రవైద్యంలో, అనగా అవయవాలు, స్నాయువుల అంటింపువైద్యంలో చాలా ముందడుగు వేసింది. సోవియట్ శస్త్రవైద్యుడు వి. ఖెక్‌కిన్ ప్రపంచం అంతట్లోకి ప్రప్రథమ పర్యాయం కోసివేయబడిన కుక్క కాలును తిరిగి కుక్కకు అతికించి అది పనిచేయగలిగేట్టు చేశారు. కుక్క కాలును కోసివేసి ప్రత్యేకమైన ఒక రిఫ్రిజిరేటర్‌లో 25 గంటలపాటు ఉంచి మళ్లీ దానిని కుక్కకు అంటించవచ్చునని ఎ. లపచిన్స్కీ తెలియచేస్తున్నారు. శస్త్రవైద్యులు త్వరలోనే, కోసివేయబడిన అవయవాలను సత్వర శస్త్రచికిత్సా పద్ధతుల ద్వారా పునరుద్ధరించగలుగుతారు.

ఇతర శరీరాలకు ఎక్కించడానికీ, అతికించడానికీ బ్రతికున్న శరీరాలనుండి రక్తాన్నీ, స్నాయువులను తీసినట్టుగానే మరణించిన శరీరంనుండికూడా తీయవచ్చునని పరిశోధనలవల్ల వ్యక్తమవుతున్నది. ఈ విషయంలోగూడా సోవియట్ శాస్త్రజ్ఞులు ప్రముఖ విజయాలను సాధించారు.

## జీవంతో ఉన్నవారికి మృతులసేవ.

మరణించినవారి శరీరాలనుండి రక్తాన్ని తీసి బ్రతికున్నవారికి ఎక్కించడం సాధ్యమని మొట్టమొదటసారిగా సోవియట్ విజ్ఞానశాస్త్రవేత్త వి. షమోవ్ తెలియజేశారు. ఎకడమీషియన్ ఎస్. యుడిన్, ఆయన శిష్యులు యీ విషయంలో పరిశోధనలను జరిపారు. ఈ పరిశోధనల ఫలితంగా చనిపోయిన శరీరాలనుండి తీసిన స్నాయువులను, కనుగుడ్డు పైపొరలను బ్రతికున్నవారికి అంటుపెట్టడం సాధ్యమని తేలింది. ఈ పరిశోధనల తర్వాతనే ఎకడమీషియన్ వి. ఫిలతోవ్ ప్రపంచప్రఖ్యాతిగాంచిన శస్త్రచికిత్సలను జరిపి వేలకొలది మందికి దృష్టిని ప్రసాదించారు. ఈనాడు సోవియట్ శస్త్రవైద్యులు చనిపోయిన వారి శరీరాలనుండి రక్తనాళాలు, గుండెకాయ, మూత్రపిండం, కాలేయము, జీర్ణకోశము, జంతువులలోనైతే శరీరంపై సగభాగాన్ని, క్రింది సగభాగాన్నికూడా తీసి బ్రతికున్న శరీరాలకు అతికించగలుగు

తున్నారు. ఈ విధంగా మృతులు సజీవు లకు సేవచేస్తున్నారు.

### తలల అతికింపు

మెదడును పునరుద్ధరించడం చాలా క్లిష్టమైనపని. అందువల్ల తలనుతీసి మరొక శరీరానికి అతికించడం చాలా కష్టమైన పని. 1928 లో చిచులిన్, ఎస్. బ్ర్యకో నెంకోలు కోసివేయబడిన కుక్కతలను పునరుద్ధరించి చూపించారు. ఆ కుక్క నోటిని బాగా తెరిచి, ఆహారాన్నికూడా మ్రింగగలిగింది. రక్తప్రసారం ఆగిపోయిన తర్వాతకూడా కొంత సేపటివరకు కుక్క మెదడు సజీవంగానే ఉండగలదని దీనినిబట్టి వ్యక్తమవుతుంది. మరొక ప్రయోగంలో సోవియట్ విజ్ఞానశాస్త్రవేత్తలు ఒక పెద్ద కుక్క మెడకు ఒక కుక్కపిల్ల తలను అతికించారు. ఆ రెండుతలల కుక్క ఆరు సంవత్సరాలపాటు బ్రతికింది. అతికింపబడిన తల కుక్కపిల్లలాగనే చిలిపిచేష్టలు చేస్తూ ఉండేది.

### పునఃప్రాణప్రతిష్టకు కృషి

అన్నిటికంటే ఆసక్తిదాయకమైన పరిశోధనలు పునఃప్రాణప్రతిష్ట విషయంలో కొనసాగుతున్నాయి. 1913 లో రష్యన్ విజ్ఞానశాస్త్రవేత్త ఎఫ్. ఆంద్రియేవ్ చనిపోయిన రెండు కుక్కలను బ్రతికించడంతో యీ కృషి ప్రారంభమయినదని చెప్పవచ్చు. అప్పటినుండి ఈ విషయంలో మహత్తరమైన పరిశోధనలు జరిగాయి. మనుష్యులకు "క్లినికల్" మరణం ప్రారంభమైన తర్వాత శస్త్రచికిత్సను జరిపి పునఃప్రాణప్రతిష్టను చేయగలిగారు సోవియట్ శాస్త్రజ్ఞులు. క్లినికల్ మరణం అంటే గుండె కొట్టుకోవడం, ఊపిరి ఆడటం ఆగిపోయి 5 లేదా 6 నిముషాలు అయినా యింకా శరీరం శిథిలం కావడం ప్రారంభం కాకుండా ఉన్నప్పటి స్థితి అన్నమాట.

### చచ్చి బ్రతికినవారు

క్లినికల్ మరణంనుండి పునర్జన్మను పొందినవారిని మరణించిన స్థితిలో వారికి యెలా ఉన్నదో చెప్పమంటే వారు ఇలా సమాధానం చెబుతుంటారు: "అబ్బే. యేమీలేదు. హాయిగా నిద్రపోయాను." అనగా క్లినికల్ మరణంలో ముందుగా మెదడు పనిచేయడం ఆగిపోతుందన్నమాట. ఈ క్లినికల్ మరణ సమయంలో చికిత్సను చేయగలిగితే మానవుడిని తిరిగి బ్రతికించవచ్చును.

### భవిష్యత్తులో అద్భుతవిజయాలు

సోవియట్ శాస్త్రజ్ఞులు, అందులోను ముఖ్యంగా వి. నిగోవ్స్కి, అతని శిష్యులు క్లినికల్ మరణాన్ని గురించీ, ఆ స్థితినుండి శరీరాన్ని పునరుద్ధరించడాన్ని గురించీ, ఆ అద్భుతమైన పరిశోధనలను జరుపుతున్నారు. ఈ విషయాన్ని గురించి వి. నిగోవ్స్కి ఒక గ్రంథాన్నికూడా వ్రాశారు.

అవయవాల పునరుద్ధరణ శస్త్రచికిత్సలో సోవియట్ విజ్ఞానశాస్త్రవేత్తలు జరుపుతున్న పరిశోధనలు వైద్యశాస్త్రాభివృద్ధికి బ్రహ్మాండంగా దోహదం చేస్తాయి. భవిష్యత్తులో మరింత అద్భుతమైన పరిశోధనలకు అవకాశాలు యేర్పడుతున్నాయి.

# మతకర్తలు: తద్భక్తిభేదములు

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

(గత సంచిక తరువాయి)

ఆతఁడు జీవించియుండిన కాలమున దక్షిణభారతమున ఎడతెగని మతాభిమానాభినివేశము చెలరేగి, ఆయా మతానుయాయులు దమతము మతోత్కృష్టమును గూర్చి ప్రజాప్రబోధము చేయుచుండిరి. సునిశిత ధిషణాతిశయము గలవారు విజ్ఞానవీథులలో విహరించి తత్త్వమవగాహనము చేసికొన్నవారు నగు ఉద్దండ పండితులు ప్రామాణికములగు వ్యాఖ్యానములు పెక్కు వేదాంతగ్రంథములకు వ్రాసిరి. సర్వమత సిద్ధాంతములలోఁ బ్రవీణు లనిపించుకొన్న విద్వాంసులు సమావేశమగు సభలలోఁ బ్రతివ్యక్తియుఁ, దానభిమానించిన యేదో యొక పక్షమును స్వీకరించి, మతచర్చలు, వేదాంతవిషయికవాదములు మున్నగువానిలోఁ బాల్గొనెడివాఁడు.

ఇతని కాలమున దేశమందుఁ ముఖ్యముగ దక్షిణభాగమున మతవిషయిక వాదములలోఁ బరస్పరము అద్వైత విశిష్టాద్వైత మతాభినివేశము గలవారు హోరాహోరిని బోరాడుచుండిరి. అందు విశిష్టాద్వైతమునకు ఏకైక ప్రతినిధిగ వేదాంతదేశికుఁడు ఉండెడివాఁడు. మత సంబంధములగు సహింపరాని పీడనములు చెలరేగిన దుష్కాలము గడచిపోయినది. కాని, శైవ, బ్రాహ్మ్య, వేదాంత సిద్ధాంతములకుఁ బనుపడిన ఆర్యజాతిలోని వైరము మాత్రము కొంటువడలేదు. కాన, ఇతరమతానుయాయుల అలజడుల వల్ల వేంకటనాథుఁడే ముందు నిలువవలసివచ్చెను. ఇతఁడు శ్రీరామానుజాచార్యుల విశిష్టాద్వైత మత సూక్తుల ననుసరించి యాతని తత్త్వమును విశదపఱచు వేదాంతోపదేశముల సూత్రప్రాయములుగఁ గాక విపులముగఁ బ్రకటించెను. దేశమందెల్లెడ ఈ రీతినతఁడు యాతనికి విశిష్టాద్వైతము వ్యాపింపఁజేసినందుననే 'వేదాంతదేశిక'– బిరుదము ప్రాప్తించెను. సాధారణముగ అట్టిగౌరవము శ్రీరంగమందలి రంగనాథునిచేఁ బ్రసాదింపఁబడినట్లు ఊహింతురు. సాధారణముగ నిది అర్హులయినవారికి అర్చకాళి మూలముగ అందఁజేయును.

వేదాంతదేశికుఁడు బాల్యమునుండియే, యీడునకు మించిన తెలివితేటలతోఁ బ్రకాశింపసాగెను. ఇరువదియేండ్లగునప్పటికితఁడు సమస్తవిద్యలార్జించెను. అంత వనతికాలముననే యీతఁడు వేదములను, దద్భాష్యములను జక్కఁగ నేర్చెను. శాస్త్రములన్నిటిలోను ప్రావీణ్యము సంపాదించెను. ఆగమములను, సంస్కృతవాఙ్మయమును ఆపోశన పట్టెను. ఇతఁడు తర్కమున ఎవ్వరదివఱకుఁ గాంచని భాగములన్నిటిని బట్టిపట్టెను. ఆతనికి వైదిక లౌకిక సారస్వతములు కరతలామలకములు. ఇతనికి వేదాంతములో నెంతప్రజ్ఞ గలదో, అంతటిదే కావ్యములలోను గలదు. మతవైషమ్యముగల తక్కినవిద్వాంసులుకూడ, ఈతని ప్రత్యేక ప్రతిభం గని ముగ్ధులై– "కవితార్కికసింహ" బిరుదు నిచ్చిరి. అంతియగాక వేంకటనాథుఁ దఱవమునను మంచి తెలివితేటలను గడించెను. ప్రత్యేకముగ ఆళ్వారుల ప్రవచనములు నిమిడీకృతములుగ ఉండు ప్రబంధమును బలుమారు జదువుటలో ఆతని కత్యంతాసక్తి యుండెడిది. ఆళ్వారుల ప్రబంధమును ఈతఁడే మొట్టమొదటిసారిగా "ద్రావిడవేద" మని ప్రవచించినవాఁడని తోఁచుచున్నది. పలువిషయములయందు సులభముగాఁ బ్రవేశించు బుద్ధికుశలతగల దేశికుఁడు ద్రావిడ సంస్కృత సారస్వతములలో అద్భుతమగు చొఱవ గలిగి, ఆరెంటియందు విశేషపాండిత్యముపార్జించెను. భారతీయ కళలు, ఆచారములు మున్నగు వానియందితరులకంటె ఈతఁ డెక్కువ ప్రతిభను బ్రదర్శించెను. ఇతని త్రికరణశుద్ధితోఁ గూడిన నిష్కాపట్య స్వభావమును ధర్మనిష్ఠాపరతయు, నితని నాచార్యపురుషుఁడుగనే గాక, అవతారపురుషుఁడుగను జేసెననుటలో సందియమిసుమంతయు లేదు. ఈతఁడు కేవలము ఉపదేశకుఁడు మాత్రమే గాక అనుభవపూర్వకముగు పరిశ్రమము గలవాడునై తనరెను. ఇతఁడు సర్వసామాన్య జీవితము గొనసాగించుచు, మతసంబంధములగు కఠిన నియమముల నేమాత్ర మేమఱక ఆచరించుచుండెను. గృహస్థ జీవితము గొనసాగించుచునే, ప్రాపంచిక విషయములతో సంబంధము లేకుండ, ఎట్టి కష్టములైన

ధరించుచు, సన్న్యాసివలెఁ గాలయాపనము చేయఁదగునని. తన జీవితవిధానముచే లోకమున కాదర్శపురుషుఁ డయ్యెను. ఒకయాశ్రమము విడిచి, మఱొక యాశ్రమమును జేకొనుటచేతనే— మనోవృత్తి మారదు. కావున, ఏ యాశ్రమమున నుండినను మనస్సు నరికట్టి తన యధీనమున నుంచుకొనుటవలననే. ఆధ్యాత్మిక చింత బలపడఁగలదనుట ఇతని యభిప్రాయము. పరంపరానుగతముగఁ దన్మతస్థులు "ఇతఁడొకింత పొట్టిగ నుండినను తీగెవంటి సన్నని శరీరము గలవాఁడనియు, మంచి యారోగ్యసంపదతో నొప్పువాఁడనియు, సద్భుతమైన యోగిమితోఁ గూడినవాఁడనియుఁ" వక్కాణింతురు. తీర్థయాత్రాదిప్రయాణములలో ఈతఁడెన్నడును శకటములు మున్నగు వాహనముల నుపయోగించేవాఁడే కాఁడఁట! ఇతని దినచర్యనుగూర్చి యొకశిష్యుఁడు వ్రాసిన వ్రాఁతలు పరిశీలించుచో, నితఁ డెంతటి సామాన్యుఁడగు మనుగడ, సంపూర్ణమగు ఆత్మప్రత్యయము, విసువెఱుఁగని పరిశ్రమము మున్నగు ప్రకృతిసిద్ధములగు గుణములు గలిగియుండెనో తెలియవచ్చును. ప్రాపంచిక విషయములందు ఇతఁడు మాపు సలక్ష్యము వచింపఁదరముగానిది. ఇతఁ డితర మతస్థాపకుల నహంభావముతో ధిక్కరించినను, వైష్ణవమతావలంబుల యెడ నమ్రత గలవాఁడు. మతసిద్ధాంతములలోని స్వల్పభేదములను ఇతఁడంత సరకు చేయువాఁడు కాఁడు. మిక్కిలి గూఢములగు తాత్విక విషయములనుగూర్చి మిక్కిలికష్టతరములగు పద్యరచనముల కితని లేఖినినుండి మృదుమధురములగు విరణము లెంతయు జాలువాఱెసివి. ఎల్లవిషయములలోని విజ్ఞానశాఖల కితఁడు వ్రాసిన సంస్కృత ద్రావిడ వ్యాఖ్యానము లొకనూటికి మించినవి గలవు. ఇట్లితఁడు తన ప్రత్యర్థులమీఁదఁ బ్రయోగించుటకుఁ దగిన సాధనములన్నియు సమకూర్చుకొనెను. అవి చులుకైనవి;— ముందుకుఁ జొలుచుకొని పోవు శక్తి గలవి; ఎత్తిపొడుపులతోఁ గూడినవి; పరిహాసముతో నిండినవి. అధికారపూర్వక ప్రబోధములు గలవి తార్కికధోరణిలో సాగునవి. అన్నిటిని మించినట్లు నిష్కపట మతవిశ్వాస జనకములయినవి. శ్రీరామానుజుల మతసిద్ధాంతములను స్థిరములగు పునాదుల మీఁద నిలిపి, అన్యమతముల అక్రమవాదములను చెల్లాచెదరు చేయవలెనను— ఇతని దృఢసంకల్పము నెఱవేఱుట కితఁడెల్లప్పుడు సర్వసంసిద్ధుఁడుగ నుండెను. ఇతఁడు వైష్ణవబ్రాహ్మణ్యమునకు పూర్వాచార ప్రతినిధిగ ఎన్నబడెను. అయిన, అట్టి ప్రాతినిధ్యము మత విరుద్ధమయినదియు, మాటిమాటికి మారుచాపల్యమునకు లోనయినదియుఁ గాదు. అతఁడు క్షేత్రముయొక్కగాని, తీర్థముయొక్కగాని— పావనత్వమునే ప్రధానముగ గణించువాఁడు. రాతియందును, ప్రతిమయందును గల బ్రహ్మానందదాయకమగు ఆధ్యాత్మికవస్తువునే ముఖ్యముగఁ జూచువాఁడు. శ్రీరామానుజులవలె నితఁడును మానవ లోకోద్ధరణ విషయమున ఆస్థగలవాఁడు. "హైందవమతము స్వభావసిద్ధముగ ప్రత్యేకవ్యక్తిగతమయినది. ఏక జాతీయతను విస్పష్టముగ దెలుపదు. ఏలయన, అట్టి జాతీయతగాని, సాంఘిక వ్యవస్థగాని దానియందే మాత్రము గనఁబడదు"— అని పాశ్చాత్త్యులు అధిక్షేపింతురు. ఓపికవహించి. మనస్ఫూర్తిగ అట్టివారు శ్రీరామానుజులయొక్కయు వేదాంత దేశికుల యొక్కయు— వివరణములను వ్యాఖ్యానములను జదువుచోఁ దప్పక తమ యభిప్రాయములను మార్చుకొనఁగలరు. "మానవసేవయే మాధవసేవ" అని ఇతఁడు పలుమారు చాటిచెప్పెను.— ఇది ఎవరినోటి నుండియో గాక వేదాంతదేశికుని వాక్కునుండియే. బహిర్గతమగుటచే, వేదవాక్కు అనఁదగును. ఆనాఁడు 'తెంగలై'— వైష్ణవశాఖవారిపై ఇతని కరుణామృత ప్రవాహము ప్రసరించెను. ఆతెగవారి వైష్ణవము వడగలై వారి దానికంటెఁ గొంచెము విభేదము గలది. కాని అది లెక్కింపఁదగినది కాదు. వడగలై తెగవారివలె వేదములకుఁ దద్భాష్యములకుఁ గాక, తెంగలై తెగ ద్రావిడవేదముల కెక్కుడు ప్రాధాన్య మిత్తురు. అదే వారికి వేదము. వివాదములు పొసఁగినపుడు వేదాంతదేశికుఁడు 'తాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్లు' అనువాఁడు. ఎవరెంత చెప్పినను, అది యెంత శాస్త్రప్రమాణానుగుణ్యమయినను, ఒకరాగాన, అంగీకరింపఁడు. అట్లయ్యు, ఒకసారి అతఁడు ప్రత్యర్థికి సరియగు సమాధానమీఁజాలక తలవంచుకొనవలసివచ్చెను. అట్టియెడ దెబ్బతిన్న కృష్ణసర్పము మాంత్రికునివలన గిరిగీయఁబడిన స్థలమునుండి చలింపఁజాలక బుసకొట్టునట్లు— తన స్థానమునుండియే తనతోఁ జర్చించిన పగతుపై నిప్పు కలిమియుచు నిందించెను. ఇతని మతవిశ్వాసమంతదృఢతరమయినదియే కాక, కెట్టితనమును, విచిత్ర ధోరణియుఁ గలది. ఆమాయకత్వముతోను— 'ఓర్వలేనితనముతోను గన్నుమిన్నెఱుఁగని భౌతికవాదు

(601 వ పేజి చూడుడు)

# నిరుపమ

మూలం : "నిరాల"

అనువాదం : "అరుంధతి"

(గతసంచిక తరువాయి)

## 11

నిరుపమ నీలిని వెంటబెట్టుకుని పొలానికి బయల్దేరింది. కూడా నౌఖరుకూడ వున్నాడు. వీధిలో ఒకచోట ఊళ్ళో ఆడవాళ్ళందరూ ఆమెను చుట్టుముట్టారు. అందరూకూడ యెంతో ఆప్యాయంగా మాట్లాడారు. జమీందారుగారు బ్రతికివుండగా గ్రామప్రజలందరూ యెంతో సౌఖ్యాన్ని అనుభవించేవారు. నిస్తులనేవే ఆకాలంలో మరచిపోయారు. పంటలు సరిగా పండకపోతే జమీందారుగారు తమగాదెల నుండి ధాన్యాన్ని రైతులకు పంచిపెట్టేవారు

'అడ్డులేవండమ్మా' అంటూ నౌకరు ముందుకు వచ్చాడు.

"ఛా వుండు, మాట్లాడనీ" అంది నిరు చిరునవ్వుతో.

"ఇలా వెధవ బ్రతుకు బ్రతుకుతు యీగ్రామంలో వుండేబదులు మరోచోటకి పోతే బాగుంటుంది" అంది ఒకామే.

"చూడమ్మా-గుడ్డలు, యిదివరకెప్పుడైనా యిలా వున్నామా? ఊరికే శరీరం కప్పుకొందుకు ... ఆషాడ మాసం ... గింజలురావు ... నాన్నగారు బ్రతికి వున్నంతకాలం ఆరు రూపాయిలు యిచ్చేవాళ్ళం — యీ మూడుసంవత్సరాలలోను మూడు రెట్లు చేశారు, యెంతవరకు యిస్తాంచెప్పండి ... పొలాలుదున్నకపోతే కడుపునిండదు... చేసిన దానికి తగ్గఫలితం..." అంది మరొకామె.

"ఇక చాల్లెండి - మహాచెప్పొచ్చారు. దారివ్వండి..."అన్నాడు నౌఖరు కోపంగా.

"ఏమిటి మామ్మా ... ఏమిటి చెప్పు ... ఏం జరిగింది? అంది నిరు యెంతో సహృదయతతో.

"కృష్ణ కుమార్ పొలం మాలిక్యామున్నతో వుండేవాడు. కుమార్ బాబు పైదేశాలకు వెళ్ళినందువల్ల కోపంతో అందరూ ఆయన్ను వెలివేశారు. అందువల్ల అతడి పొలాన్ని గ్రామస్థులకు అప్పగించమన్నారు. కాని మాలిక్యా ఒప్పుకోలేదు. అందుకు ..." అంటూ ఆ ముసలిది పడిపోయింది.

"అదేమిటి? పడిపోయిందేమిటి?" అంది నిరుపమ కంగారుగా.

"దొంగముండండీ! ఆ మాలిక్యా దానికొడుకు వాడికి అపస్మారక రోగం వుంది. దానివల్లేవాడు గోతిలో పడి చచ్చిపోయాడు. అందుకు యీ ముండ సైతానులా అందర్నీ పట్టుకుని తిట్టడం ప్రారంభించింది. ..." అన్నాడు నౌకరు.

ఇంతలో అక్కడచేరిన ఆడవాళ్ళందరూ పడిపోయిన మాలిక్యాతల్లిని లేవతీశారు.

"ఈ కథ అంతా అన్నయ్యగారికి తెలుసు. ఆయనే చెప్పారు నడవండమ్మా" అంటూ నౌకరు దారి దీశాడు.

ముగ్గురూ తోటలోకి వెళ్ళారు. ఎదురుగా మామిడి చెట్టుక్రింద సురేష్ కూర్చున్నాడు.

"అమ్మగారొచ్చారు. కన్పించటంలే. ఒక కుర్చీ యిట్లా పట్టుకురావే" అన్నాడు నౌకరు అక్కడ పని చేసే దాంతో. అది పరుగునవెళ్ళి కుర్చీ తీసుకు వచ్చేకంగారులో కుర్చీతోసహా పడిపోయింది. కుర్చీ కాలొకటి విరిగిపోయింది. నౌకరు కోపంతో ఆ కూలిదాన్ని కొట్టడానికి వెళ్లాడు. నిరు అడ్డంవచ్చి వాణ్ణి కేకలేసింది. వాడు సురేష్ బాబు ముఖంకేసి చూస్తూ నిలబడిపోయాడు. సురేష్ కూలిదానివైపు కోపంగా చూస్తూ విసుక్కున్నాడు. ఇదంతా నిరుపమ గ్రహించింది. అంతలో ఆ నౌఖరే మరొకకుర్చీ పట్టుకువచ్చాడు.

రైతులందరూ దున్నేనాగళ్లను వదలిపెట్టి

అక్కడకు వచ్చారు. ఆ ప్రక్కనే వున్న బావిలోంచి ఒక ముసలామె నీళ్లు తోడుకుంటోంది. నీలిమాచి "అక్కా ఆమె కుమార్ బాబు తల్లి" అంది నెమ్మదిగా.

"కుమార్ బాబు" అంటూ సురేష్ కోపంగా చెల్లెలు నెత్తిమీద మొట్టాడు. నిరుపమ ఆశ్చర్యంగా అన్నగారి ముఖంలోకి చూచింది ప్రశ్నార్థకంగా.

"వాళ్లను ఊళ్లో వాళ్లందరూ వెలివేశారు. ఊళ్లో వున్న బావి నీళ్లు పట్టుకోనివ్వరు. అదేం అధర్మమో? అందుకనే యిక్కడకు వచ్చిపట్టుకొంటోంది. ..." అన్నాడు సురేష్.

ఈ విషయాలన్నీ తనకు తెల్సుండికూడా యేమీ తెలియనట్లు, "ఏమిటన్నయ్యా" అంది నిరు.

"ఏమీ లేదు... అదంతా మనకెందుకులే ఇక్కడి రీతి రివాజులు - ఆచారాలు" అన్నాడు సురేష్. నిరుపమ యేమీమాట్లాడలేదు.

"ఈ బావినికూడ సర్కారువారు తీసుకుంటే బాగుంటుంది. అందరికీ లభిస్తుంది ..." అన్నాడొకడు.

"వారి భూములన్నీ దొరవారు తీసుకున్నారు. ఇక ఉన్న యిల్లు ఒక్కటి వుంది..." అన్నాడు మరొకడు.

ఆ మాటలో నిరుపమకు అంతా అర్థమైంది. అయినా ఆ క్షణంలో అన్నగారినేమీ అడగదలచుకోలేదు. సావిత్రిదేవి కేసి చూస్తోంది. ఆమె బిందె భుజమీద కెత్తుకుంటూ నిరుపమకేసి చూచింది. ఇద్దరికళ్లు కలిశాయి. అధునాతన అలవాట్లు సాంప్రదాయాలతో కాలానికనుగుణంగా మారుతున్న యువతి నిరుపమ. ప్రపంచంలోని క్రూరత్వాన్ని అవమానాన్ని, అన్యాయాల్ని సహిస్తు, సనాతన సాంప్రదాయాలతో కాలం వెళ్ళబుచ్చుతున్న కరుణామూర్తి సావిత్రిదేవి. ఆమె చూడగానే నిరుపమ భక్తితో తలవంచుకుని మనసులోనే ఆమెకు నమస్కరించింది.

"బాబు - ఆమెను యీ తోటలోని బావికి రావద్దని మీరు చెప్పండి" అన్నాడు గురుదీపక్ సురేష్‌తో,

"వెధవ మూర్ఖత్వం. నీ పనేదో నువ్వు చూసుకోక యివన్నీ నీకెందుకు?" అన్నాడు సురేష్ కోపం నటిస్తూ. నిరుపమ మాత్రం చిరునవ్వుతో గురుదీన్‌ని చూస్తూ నిలబడింది. అతను తలవంచుకొని "పొలం దున్నటమైంది. ఇక విత్తనాలు జల్లాలి. మీరు అనుజ్ఞయిస్తే మొదలుపెట్టుతాం" అన్నాడు.

నిరుపమ గురుదీన్‌నికేసి తీక్షణంగా చూడడం గమనించి సురేష్ అన్నాడు— "మేం జమీందార్లమైనా ఒకర్ని నాశనంచేసేవాళ్లం మాత్రం కాదు. ప్రజలందరూ సుఖంగా వుంటేనే మేము సుఖంగా వుంటాం.... ఆ బావి యెక్కడున్నా నీళ్లు తీసుకు వెళ్లవద్దని చెప్పేదెవరు? ఏ జాతివాళ్లైనా మంచినీళ్లకుమాత్రం యెవ్వరూ అడ్డుపెట్టకూడదు."

"అవును. అందరూ పట్టుకుంటారు..." అంటూ నసుగుతూ మన్నీ విత్తనాలు పట్టుకొని వెళ్లిపోయాడు.

"ఈ పొలాన్ని యిదివరలోకూడ అందరూ కలిసే చేస్తున్నారా?" అంది సురేష్ ముఖంలోకి చూస్తూ. ఆ చూపు చాలతీవ్రంగా వుండటం సురేష్ గమనించక పోలేదు. ఆ విషయం యిప్పుడామె యెందుకడిగినట్లు? ఆమెకు సమాధానం చెప్పటం కొద్దిగా యిరకాటంగా తోచింది.

"లేదు. గిరిజాశంకర్ పేర వుండేది. అంతకు ముందు మూడుతరాలనుండి వాళ్లే సాగుచేస్తున్నారు. పన్నులు చాల తక్కువగా వుండేవి... అయినా, వాళ్లు స్వయంగా సాగుచెయ్యడంలేదు. మొదట ఆయన కలకత్తాలో వుంటూ యిక్కడ రైతులచేత సాగుబడిచేయిస్తూ వుండేవాడు. తర్వాత ఆయన కాన్పూరులో స్థిరపడ్డాడు. ఆయన చనిపోయిన తర్వాత ఆయనభార్య యిక్కడ స్థిరపడి సాగు చేయిస్తూ శిస్తులు కడుతూ వచ్చింది యింతవరకు... కాని, ఉన్న కాస్తభూమినీ బాగుచేయిద్దామన్న దృష్టి వాళ్లకులేదు. పైగా దానిమీద పెట్టుబడిపెట్టే స్తోమతకూడ లేదు. ఇలాగే వూరుకుంటే ఇది కాస్తా బీడువారి పోతుంది. అందువల్ల స్వాధీనపరుకున్నాం..." అని పనిచేసేవాళ్లకేసి చూస్తున్నాడు.

"అయితే — యీ తోట యెవరిది?"

"ఇదికూడ గిరిజాశంకర్ దే. దీన్ని బాగుచేసే వాళ్లెవరూ లేరు. చూడు — ఎన్నిచెట్లు యెండిపోయాయో! ఉన్నమొక్కలు యెండిపోతుంటే యెవరైనా కొత్తమొక్కలు నాటుతూ వుంటారు. కాని వీళ్లు ఆదేమీ చెయ్యరు. పోనీ తోటం స్వాధీనం చెయ్యమని అనేకసార్లు కబురుపంపాను

అనేక ఉత్తరాలు - వ్రాశాం. నోటీసులు యిచ్చాం. కాని సమాధానం రాలేదు. అందువల్ల దావావేసి స్వాధీనపరచుకోవలసి వచ్చింది..." అంటూ అతడు వెళ్లిపోయాడు.

నీలిని తీసుకొని నిరుపమ యింటికి వచ్చేసింది.

## 12

ఆనాడు మధ్యాహ్నం భోజనాలయిన తర్వాత విశ్రాంతి తీసుకొంటూ సురేష్ నీలిని పిలిచాడు.

"ఏం అన్నయ్యా?" అంటూ వచ్చింది నీలి.

"కూర్చో..." అంటూ సోఫాలో తన ప్రక్కనే కూర్చోమని "ఈ పల్లెటూరివాళ్లు చాల దుర్మార్గులు" అన్నాడు.

"అవునవును..."

"కాని ముగ్గురు మాత్రం మంచివాళ్లు కదూ!"

"అవును. నేను ఉదయం రామచంద్ర యింటికి వెళ్లాను. వాళ్లమ్మ టిఫిన్ పెట్టింది. ఎంతచక్కగా మాట్లాడిందనుకున్నావు!"

"ఏం పెట్టిందేమిటి?"

"చాల పెట్టింది .. పాలకోవా... ఇంకా యేవేవో వున్నాయి."

"మీకోసమని తయారుచేసి వుండవచ్చు. మాతో బాటు నువ్వుకూడ వస్తావని తెలిసి ముందుగానే చేసి వుంటుంది. స్టేషనుకు బండి పంపమని కరణంగారికి వ్రాశాం కదూ..."

"నన్ను యింటిదాకా దిగబెట్టడానికి రామచంద్రనుకూడ పంపించింది. అక్కనుకూడ రమ్మని చెప్పింది."

ఆమాట వినేసరికి అతడి ముఖకవళికలు మారాయి. ముఖం ఆదోలా పెట్టి, "నువ్వొక్కత్తెవే వెళ్లావా?" అన్నాడు.

"ఒక్కత్తెనే. దారిలో ఒకాయన్ని అడిగాను. ఆయన విసుక్కుంటూ యిల్లు చూపెట్టి, ఏంచేసాడో తెలుసా? నోట్లో నీళ్లు పోసుకొని ఉమ్మేశాడు..." అంటూ నవ్వింది.

"అయితే నువ్వు వెళ్లేటప్పుడు మీ అక్కయ్య వుందా? అక్కయ్యకు తెలిస్సా నువ్వు వెళుతున్నట్లు?"

"ఆ. తెలుసు. అక్కయ్యే తలదువ్వి, జడవేసింది వెడతానంటే."

"నువ్వు వెడతానన్నావా? మీ అక్క వెళ్లమందా?"

"నేను వెడతానంటే వెళ్లమంది..."

అసలు విషయం సురేష్ గ్రహించాడు. మొదట నుండి అతడు ఆ విషయంలో మెలకువగానే వున్నాడు. కుమార్, నిరుపమ ఒకరినొకరు మేడమీది నుండి చూచుకుంటున్నారని నీలి చెప్పినమాట యామినీబాబు సురేష్‌కు చెప్పేశాడు. ఆనాటినుండి ఆమె ప్రవర్తన మారకపోయినా మారిందనే అనుమానంతో వుండేవారు. కామిర్లకళ్లకు అన్నీ పచ్చగానే కన్పిస్తాయి. అనుమానాలు వచ్చినప్పుడు తెలుపుకూడ నలుపుగానే కన్పిస్తుంది. ఇంట్లో వాళ్లందరూ అనుమానపడుతున్నారని తెల్సిన తరువాత ఆమె తన ప్రవర్తననుకూడ కొద్దిగా మార్చి, అప్పటికైనా తనను వాళ్లు అర్థం చేసుకుంటారేమోనని చూచింది. ఇదివరలో యామినీబాబు ఒకసారి డబ్బు అడిగినప్పుడు_ "యిప్పుడేం యివ్వక్కరలేదు. మళ్లీ కావలసివస్తే అప్పు చేసుకోవలసి వస్తుంది" అంది అన్నగారితో. ఆ విషయం అప్పుడే తండ్రితో చెప్పాడు. "అయినా దానికి చిన్నతనం. యేమీ తెలియదు" అన్నాడా ముసలాయన.

నీలి కుమార్ యింటికి వెళ్లడం, రామచంద్ర యిక్కడికి రావటం చూచినవాళ్లందరూ సురేష్‌తో చెప్పారు. అన్నీ ఆలోచిస్తుంటే ఒళ్లు రగులుకు పోతోంది. అయితే, ఆ క్షణంలో యెవర్ని యేమన్నా చాల అల్లరి జరుగుతుందని అతనికి తెలుసు. అందువల్లనే _ అంత కోపంతో వుండికూడా _ యెంతో స్నేహంగా మాట్లాడాడు. "అసలు యింటికి వచ్చిన వాళ్లను మర్యాద చెయ్యడం మీకు చేతగాదు. ఇంటికి వచ్చిన రామచంద్రను తరిమేశారు" అన్నాడు నవ్వుతూ.

"లేదన్నయ్యా, మనం లక్నోనుండి తెచ్చినవన్నీ అక్క అతనికి పెట్టింది."

"అతడికి కాస్త టిఫిన్ పెట్టి మీరు యింట్లోపని చూసుకుంటున్నారా?"

"లేదు. అక్క చాలసేపు మాట్లాడింది. చదువుకుందుకు నెలకు యిరవై రూపాయలు కూడా పంపి

స్తానంది. వాళ్ళన్నయ్య యేమంటాడోనని అనబోతూ వుంటే అక్క అతన్ని కోప్పడిందికూడా."

"ఇంకా యేంమాట్లాడింది?... మాలిక్యా తల్లి యేదో చెప్పిందట. యేమిటి?"

"మాలిక్యా యెలా చచ్చిపోయిందీ చెప్పింది. యేదో దాని సొద...".

"అదేముందో శాంతంగా చెప్పు..." అంటూ నిరుపమ గదిలోకి వచ్చింది.

ఆ మాటతో సురేష్‌కు సిగ్గేసినట్లైంది. నిరుపమను చూచేసరికి లోలోపలేవున్న కోపాన్ని, అక్కసును వెళ్ళగక్కేద్దామా అన్నట్లయింది. అయినా, తమాయించుకొని, "నిరూ, రామచంద్రను ఊళ్ళోవాళ్ళందరూ వెలివేశారు, యెవ్వరూ వాణ్ణి యింటికి రానివ్వరూ, వాడితో మాట్లాడరు. నూతినీళ్లే పట్టుకోనివ్వటంలేదు. ఉదయం నువ్వే చూచావుగా. వాళ్లు యెలా మాట్లాడుతున్నదీని. అటువంటప్పుడు వాణ్ణి మనం చేరదీసి గౌరవిస్తుంటే ప్రజలందరూ యేమనుకుంటారు? అవుసరమైనప్పుడు మన పక్షాన వుంటారా? ఎవరిపాట్లు వాళ్ళవి. చదువుకున్నాంగదా అని మన యిష్టమొచ్చినట్లు వుందామంటే జరుగుతుందా?..." అన్నాడు.

"అయితే, యీ గ్రామప్రజల మూర్ఖత్వాన్నే మనమూ అవలంబించాలా?" అని తీక్షణంగా చూచింది అతడి ముఖంలోకి.

"అయినా, ప్రజాభిప్రాయాన్ని మనం - జమీందారులం గనక - మన్నించి పాటించాలి."

"అయితే బలవంతులైనవాళ్లు బలహీనులపై ధ్వజమెత్తినప్పుడు అది సవరించవలసిన బాధ్యత మందికాదా?" అంటూ యీ విషయం యిప్పుడే అటో యిటో తేల్చుకుందామని కుర్చీలో కూర్చుంది.

"అదీ నిజమే. మనం యిప్పుడు ఉపకారం చేశామే అనుకో — అయితే యెవరికి ఉపకారం చేస్తున్నామో దాని ఫలితాలు మనమీదే కాకుండా సంఘంమీదకూడ యెలా వుంటాయో ఆలోచించాలి. ఉపకారం చేయించుకునేవాళ్లు మంచివాళ్లా చెడ్డవాళ్లా — సంఘంలో గౌరవంగా బ్రతుకుతున్నారా లేదా? ఆ అర్హత వారికి వుందా లేదా? అన్నదే ప్రధానం."

ఆ మాటతో ఆమె తోకత్రొక్కిన త్రాచులా అయింది. కాని తన ఉద్రేకాన్ని లోలోపలే అణచుకొని కూర్చుంది యింకా మాట్లాడనీ అనుకొని.

"విషయాలన్నీ నీకు తెలియవు నిరూ. అసలు జమీందారీ అన్నదే ఒక మహాపాపం. మామయ్య చేసి వెళ్లాడు - మనం అనుభవిస్తున్నాం. ఎప్పుడూ యేవో వ్యాదేవీలు నడుస్తూనే వుంటాయి. అందరితో బాటు మనం వుండకపోతే మనకి సాక్ష్యులెవరుంటారు? లేకపోతే అందరూ మనకే యెదురు తిరుగుతారు. యీ జమీందారీ కాస్తా మూన్నాళ్లలో హరించిపోతుంది." అంటూ ఆమెవైపు చూచాడు. ఆమె యేమీ సమాధానమివ్వకుండానే చూస్తోంది. "మనం యిక్కడికి వచ్చినందుకు సంతోషంగా అందరికీ భోజనాలు పెట్టాలి. అయినా యేదో గొప్పవాళ్ల సంబంధం చెయ్యాలనుకున్నాం. అటువంటప్పుడు పెళ్లి యిక్కడ జరిగే అవకాశం యెల్లాగూ లేదు. అందువల్ల ముందుగానే యిక్కడ నలుగురికీ భోజనాలు పెట్టేస్తే బాగుంటుందనుకొన్నాను. నాన్నగారు కూడా అదే అన్నారు... అయినా ప్రపంచమంతా చలితమైనది. అనేక విభిన్నరీతులతో కూడుకొని వుంది. ఏమాత్రం పొరపాటు జరిగినా మహాప్రమాదంగా పరిణమిస్తుంది. అందువల్ల అందర్నీ కలిపివుంచడం మనకే శ్రేయోదాయకం. పెద్దవాళ్లు చెప్పినట్లుచేస్తే పితృదేవతలు సంతోషిస్తారు. అందుకనే అన్నారు పెద్దలు..."

"పితరి ప్రీతి మాపన్నే ప్రియంతి సర్వదేవతాః" అని వాక్యాన్ని పూర్తి చేసి, వెల్లువలై వచ్చే నవ్వును అతికష్టంమీద ఆపుకుని, అతడివైపు చూచింది. సురేష్‌కు సంస్కృతం రాదు. కాని తెలిసినట్లుగానే నటించి, చిఱునవ్వు నవ్వి, అన్నాడు. "అనేక యుగాల్లో అనేకవేల సంవత్సరాలు ఘోరతపస్సు చేసి మహర్షులు యీ వాక్యాన్ని వ్రాశారు. ఆ ప్రకారం నిర్వర్తించడం మనవిధి. ఫలితంకోసం ఆశించకూడదు."

(సశేషము)

# మానవుడా, ఓ మానవుడా

శ్రీ వి. వి. నాథమ్

మానవుడా, ఓ మానవుడా,
మాసినగడ్డపు మానవుడా,
ఉదయమయ్యెను, వెలుగువచ్చెను,
ఉదరనిమిత్తము వేటకేగుము.

వెలుగునీడల వేగిరపడుము,
వెనుక వెనుకనే పొంచి ఉన్నది
వెలుగును గప్పె పెంజీకటిరా,
మానవుడా, ఓ మానవుడా !

చీకటి అయ్యో అది పెంజీకటి;
చీకటిచూపే సౌఖ్యమదేదీ ?
మాసినగడ్డం మానవుడా, మనకా
చీకటియిచ్చే భోగమదేది ?
ఆకలి చిచ్చుల అరచే పిల్లలు
పిల్లల అరపుల అణగిన ఆయిలు
ముక్కుమూల్గే తాతలు, అవ్వలు
నిశి నిర్మలత, నీకేదీ, నాకేదీ,
మానవుడా, ఓ మానవుడా,

లోకబాంధవుడు తన వెయ్యిచేతుల
వెలుగులు జిమ్మెను నలుదిశల
బడికిపోయెడి పాపల జూడుము
ప్రాకుచు పడుచూ అక్కక్కనుచు
పకపకలాడె పసిపిల్ల జూడుము
ఓ మాసినగడ్డం మానవుడా
మాసినగడ్డం మంచిగచేసి
జంకలుమాని చకచకలాడుచు,
వేటనిమిత్తం బయుటకు పోరా,
మానవుడా ఓ మానవుడా,

ప్రేమ ప్రేమయని ప్రణయము చూపి
పెండ్లి చేసుకొని పొంగుచు పొరలుచు
పిల్లలు కనడం నీ పనియైతే
పాల పోయుటం నీపని కాదా
మానవుడా, అది నీపని కాదా,
కాళ్లు దాచుకొని కూరుచుండిన
నీ బద్ధకానికి సంతోషించి
కామధేనువు కల్పవృక్షము
కనకవృష్టిని కురిపిస్తాయా,
పాలవర్షము వర్షిస్తాయా,

పాలు, పాలు, పైసాయిస్తే పాలువచ్చును,
పైసావచ్చును ఎచ్చటనుండి ?
ఓ మానవుడా,

చదివితివెన్నో చక్కటి బుక్కులు,
చదువులో నున్నది 'శుద్ధి'
చదువులో నున్నది 'బుద్ధి'
చదువులో లేనిది ఏది ?
చదువగ చదువగ నీ బుద్ధి
చులకనయ్యెను మానవుడా,

మానవుడా ఓ మానవుడా,
మాసినగడ్డం మానవుడా,
మర్మములచే మాటదక్కదు
మాటలచే మరి ఆటలు సాగవు
ఆటలాడుటకు ఆత్మశుద్ధికి
పాట పాడుటకు పాలు పోయుటకు
పదవయ్యా పోదాం పనిలోకి
మానవుడా ఓ మానవుడా,

రయమున వచ్చెను రాతిరి యిదిగో,
రాగములతో రోగములతో, మరిరాదు
గద "నిదుర"

మానవుడా ఓ మానవుడా
కుక్కమొరుగులు పిల్లికూతలూ,
వినగా వినగా వింత యయ్యెనా,
ఓ మానవుడా,

నీకూ, నాకూ, అతనికి, ఇతనికి,
ఒకటేగా, యివియన్నియు ఒకటేగా,
మానవుడా, ఓ మానవుడా,
మాసినగడ్డం మానవుడా

మేలుకో, మానవుడ, మేలుకో,
మేలుకో "టైం" అయ్యె మేలుకో,
కలలుగన్నను కల్గునె ఫలము,
గాలిమేడలవి కూలిపోవవా,

మానవుడా, ఓ మానవుడా,
నిత్యము రాతిరి, నిత్యము పగలు,
కష్టించిన "ఫల" మున్నది "పనిలో"
సత్యము నమ్ముము మానవుడా,
ఓ మానవుడా,

మాసినగడ్డం మానవుడా.



# దశావతారములు

శ్రీ పేరి సర్వేశ్వరశర్మ



మన దేశము అవతారాల దేశమన్న అతిశయోక్తి లేదు. గీతలో స్వయముగా భగవంతుడు దుష్టశిక్షణ శిష్ట సంరక్షణ గావించుటకై ఆయా సమయాలలో అవతారాలు ఎత్తుతానని చెప్పియున్నాడు. సంక్షేపములో మన పురాణముల సారాంశము దశావతారములని చెప్పవచ్చును. ఈ పది అవతారముల పేర్లు ఈ క్రిందివిధముగ మనకులభిస్తున్నాయి.

మత్స్యావతారము, కూర్మావతారము, వరాహావతారము, నారసింహావతారము, వామనావతారము, పరశురామావతారము, శ్రీ రామావతారము, శ్రీ కృష్ణావతారము, బుద్ధావతారము కల్కి అవతారము పైపది అవతారాలలో కొన్ని అవతారాలగూర్చి ప్రజాసామాన్యానికి పూర్తిగా తెలియకపోయినప్పటికి శ్రీ రామావతారము గూర్చి శ్రీ కృష్ణావతారము గూర్చి తెలియని పురుషుడుగాని స్త్రీగాని భారత దేశములో లేరు. రామాయణమంతా శ్రీ రామావతార గాథయే. భారతభాగవతాదులన్నీ శ్రీకృష్ణావతార గాథలే. శ్రీరామ శ్రీ కృష్ణులగూర్చిసంస్కృతభాషలోను ఇతరభాషలలోను అనేక కావ్యాలు నాటకాలు వ్రాయబడియున్నాయి. శ్రీరామావతారము త్రేతాయుగములో జరిగింది. శ్రీ కృష్ణావతారము ద్వాపరయుగములో జరిగింది. బుద్ధావతారము కలియుగములో జరిగింది. కల్కి అవతారము కూడ ఈ యుగములోనే అవుతుంది. మత్స్యకూర్మాది ముందు అవతారములు మాత్రము ముందటి యుగములలోనివి. వాటి ప్రాధాన్యత సామాజిక దృష్ట్యా మనకంతగా గోచరించక పోయినప్పటికీ ఆ యాయుగములలో ఉండినదనియే భావించాలి. పై దశావతారాల చరిత్రలు సంక్షిప్తముగా అగ్నిపురాణములో వర్ణించిన ప్రకారముగా ఈరచనలో ఇవ్వబడినది.

## మత్స్యావతారము

గతించిన బ్రాహ్మకల్పాంతమున ప్రపంచమంతా లయమయ్యెను. అప్పుడు పదునాలుగులోకములు సముద్రములో కొట్టుకొని పోయినవి. ప్రపంచము జలమయమయ్యెను. ఆ సమయమున వైవస్వతమనువు భుక్తిముక్తులకై తపస్సు చేయనారంభించెను. ఒకానొకదినమున ఆయన జలములో తర్పణము చేయుచుండగా తనదోసిటిలో ఒక చిన్న మత్స్యము కనపడెను. ఆయన ఆ మత్స్యమును నీట బడవేయబోవ అది, "ఓ నరోత్తముడా, నన్ను నీట పడవేయకుము. నీటిలో పెద్దపెద్ద చేపలు మొసళ్ళు మున్నగునవి నన్ను తినివేయును. వాటినుండి నన్ను రక్షింపుము." అని కోరెను, అప్పుడాయన ఆ మత్స్యమును ఒక చెంబులో పడవేసెను. కొన్నాళ్ళకామత్స్యము పెరిగి పెద్దదయ్యెను. చెంబు దాని నివాసమునకు చాలలేదు. అప్పుడు మను మహారాజు దానిని యొక పెద్దపాత్రలో పడవేసెను. కొన్నాళ్లకా చేపయింకా పెద్దదగుటచే ఆపాత్రకూడ దాని నివాసమునకు సరిపోలేదు. అప్పుడు ఆయన ఆచేపను చిన్న చెరువులో పడవేసెను. కొన్నాళ్ళకాచేప యింకా పెద్దగా పెరుగుటచే ఆ చెరువుకూడ దానినివాసమునకు చిన్నదయ్యెను. అప్పుడు చేప మను మహారాజును వేరొకచోట నివాసము ఏర్పాటు చేయుమనికోరెను. ఆయన దానికోరిక ప్రకారము ఒక పెద్దసరస్సులో పడవైచెను. కొన్నాళ్ళకా చేప మిగుల పెద్దగా పెరిగెను. ఆ సరస్సుకూడ దాని నివాసమునకు చాలలేదు. అంతకంటె విశాలమైన చోటును చూపుమని మరల ఆ చేపప్రార్థించెను. మనుమహారాజు విసుగెత్తి చివరికి ఆ చేపను సముద్రములో విడచెను. వెంటనే యామత్స్యము లక్షయోజనముల విస్తీర్ణమై పెరిగెను. అద్భుతమైన యామత్స్యమునుచూచి వైవస్వతమనువువిస్మితుడై యిట్లు పల్కెను. నీవు సామాన్యమైన మత్స్యమువలె కనపడుటలేదు. ఎవరవు నీవు? ఓహో విష్ణుభగవానుడవా? ఓ నారాయణా! ఇదే నీకు నమస్కారము. ఓ జనార్ధనా, నీమాయచే నన్నీ విధముగ మోహపెట్టెదవేల. మత్స్యరూపమును ధరించిన విష్ణుభగవానుడు ప్రజాపాలనరతుడైన మను మహారాజుతో "ఓ మహారాజా దుష్టసంహారము, శిష్టరక్షణచేయుటకై యీయవతారమునేను దాల్చియున్నాను. హయగ్రీవుడను రాక్షసుడు నాలుగు వేదములను అపహరించి సముద్రగర్భములో దాగియున్నాడు. అతినినిచంపి వేదములను

రక్షించుటకై నేనీ మత్స్యరూపమును ధరించి యున్నాను, అదుగో చూడుము. ఒక నావ వచ్చుచున్నది. దానిలో నీవు సప్తర్షులతో సహా ప్రళయకాలమునంతను గడుపుము.” అని చెప్పి యంతర్ధానమును జెందెను.

## కూర్మావతారము

పూర్వకాలమున సురులు దూర్వాసమహర్షి శాపముచే దానవులచె జయింపబడి రాజ్యలక్ష్మిరహితులై ఏమిచేయుటకు తోచక బ్రహ్మనుముందు నిడుకొని పాలసముద్రమునకు వెళ్లి విష్ణుభగవానుని స్తుతించిరి. అప్పుడు పన్నగశాయియైన పద్మనాభుడు ప్రత్యక్షమై సురులతోనిట్లు చెప్పెను. మీరు వచ్చిన కార్యము సాకర్ధమైనది. మీరు మరల దైత్యులతో యుద్ధమునకు దిగక వారితో సంధిచేసుకొనుడు. సంధి జేసుకొని వారితో కలిసి మీరు ఈ పాలసముద్రమును మథింపుడు. దీనిని మథించుటవలన మీకు అమృతము లక్ష్మి రెండును లభింపగలవు ప్రయోజనమున్నప్పుడు శత్రువులతోకూడ స్నేహముచేయవలయును. అది రాజనీతి. అమృతమంతయు మీకే లభించునట్లు నేను ఉపాయమును చేయుదును. కావునమీరు మంధర పర్వతమును కవ్వముగాను, వాసుకిని త్రాడుగాను చేసుకొని దైత్యులతోకలసి ఈ పాలసముద్రమును మథింపుడు. ఈ మథనములో నేను మీకు సహాయపడగలను. అనంతశయనుని యాజ్ఞప్రకారము సురులు దానవులతో స్నేహముచేసుకొని వారితో కలసి మంధరపర్వతమును కవ్వముగాను వాసుకిని త్రాడుగాను చేసుకొని పాలసముద్రమును మథింపనారంభించిరి. అట్లు మథించునపుడు సురులు వాసుకి తోకవైపును దానవులు వాసుకి మూతివైపును పట్టుకొని మంధర పర్వతమును త్రిప్పుచుండిరి. ఈ విధముగ దేవదానవులచే కవ్వమువలె త్రిప్పబడుచున్న మంధరపర్వతము అడుగున ఎట్టి ఆధారములేక పోవుటచే నీటమునిగి పోజొచ్చెను. అప్పుడు విష్ణుభగవానుడు దేవసహాయార్థమై కూర్మావతారమునెత్తి మునిగి పోవుచున్న మంధరపర్వతమును పైకి లేవనెత్తి తన పృష్ఠభాగమున దానినిధరించెను. అప్పుడు నిశ్చింతగా సురాసురులు సముద్రమథనము చేయనారంభించిరి. అట్లు వారు సముద్రమును మథించుచుండ దానినుండి మొదట హాలాహలమను విషము పుట్టెను. ఆ విషమును ఈశ్వరుడు తనకంఠమునందు ధరించెను. ఆ విషజ్వాలవలన ఈశ్వరునికంఠము నల నయ్యెను. కావుననే ఆయన నీలకంఠుడని బిలవబడు చున్నాడు. అనంతరము మథింపబడుచున్న ఆ సముద్రమునుండి వారుణియను మద్యము, పారిజాతమను వృక్షము, కౌస్తుభమను మణి, సురభియన్నగుగోవులు, రంభాది అప్సరః స్త్రీలు లక్ష్మిదేవి బయలుదేరినవి. లక్ష్మిదేవి వెంటనే విష్ణుభగవానుని బొందెను. అప్పుడు సురులంతా సన్తుష్టులైరి. అనంతరము ఆయుర్వేదప్రవర్తకుడైన ధన్వంతరియను మహర్షి అమృతపూర్ణమైన కుంభమును చేతనిడుకొని సముద్రమునుండి బయలుదేరెను. అపుడు జంభాదిదైత్యులు ధన్వంతరి చేతిలోని అమృతకుంభమును తీసుకొని పారిపోయిరి. అంత విష్ణుభగవానుడు మోహినీరూపమును ధరించి దైత్యుల వద్దకు వెళ్లెను. రూపయౌవన సంపన్నయైన మోహినిని చూచి దైత్యులు విమోహితులై, ఓ సుందరాంగీ, నీవు మాకు భార్యవై అమృతమును పంచిపెట్టుమని కోరిరి. మోహినీరూపధారుడైన విష్ణుభగవానుడట్లనేయని చెప్పి దైత్యుల నుండి యమృతకుంభమును దీసుకొని సురులకుదానిని పంచిపెట్టసాగెను. అదికనిపెట్టి రాహువు దేవరూపమును ధరించి యమృతమును త్రాగబోవ సూర్య చంద్రులు సంజ్ఞచేసిరి. అంత విష్ణుభగవానుడు వారి సంజ్ఞనుగ్రహించి తన చక్రముచే రాహువు శిరస్సును తుండెమునుండి వేరుచేసెను. ఈ విధముగ విష్ణుభగవానుడు స్త్రీరూపమును ధరించి అమృతమునంతను దేవతలకు పంచిపెట్టియనంతరము నిజరూపమును ధరించి సురులతోగోష్ఠి సలుపుచుండ ఈశ్వరుడచటకు వచ్చి ఓ విష్ణుమూర్తీ, స్త్రీరూపమును ధరించిననిన్ను చూడవలయునని నాకు కుతూహలముగ ఉన్నది. కావున మరియొకసారి స్త్రీరూపమును ధరింపుమని కోరగ విష్ణుభగవానుడు మరల స్త్రీరూపమును ధరించెను. ఆరూపమునుచూచి విష్ణుమాయచే మోహితుడైన ఈశ్వరుడు ఉన్మత్తుడై పార్వతిని విడచి ఆ స్త్రీ వెంటబడి ఆమె కేశములను పట్టుకొనెను. అపుడామె కేశములను విడిపించుకొని పరుగులెత్తికొని పోవుచుండ ఈశ్వరుడుగూడ ఆమెవెంట పరుగెత్తనారంభించెను. అట్లు పరుగెత్తునపుడు ఈశ్వరుని వీర్యము స్ఖలితమై అచ్చటచ్చట భూమిమీదపడెను. అట్లు ఈశ్వరుని వీర్యము పడినప్రదేశములన్నియు గొప్ప గొప్పక్షేత్రములుగాను బంగారు లింగములుగాను తయారైనవి. కొంత సేపటికి శివుడిదంతయు మాయయని తెలుసుకొని స్వస్వరూపుడై యుండెను. అప్పుడు జనార్దనుడు ఓ ఈశ్వరా, నీవు నామాయను

జయించితివి. నీవుతప్ప నామాయను జయించువాడే ప్రపంచమున వేరొకడు లేడు అని చెప్పి స్వస్వరూపమును దాల్చెను. అమృతము లభింపకపోవుటచే దైత్యులు సురులచే పరాజితులైరి. సురలు మరల తమస్వర్గలక్ష్మిని బొంది హాయిగనుండిరి.

## వరాహావతారము

పూర్వకాలమున హిరణ్యాక్షుడను దానవేశుడు సురులను జయించి స్వర్గరాజ్యమనుభవించుచుండెను. అంత సురులు దుఃఖితులై విష్ణుమూర్తివద్దకు పోయి మొఱపెట్టుకొనిరి.. అప్పుడు విష్ణుభగవానుడు యజ్ఞవరాహరూపమునుదాల్చి యాదానవుని సైన్యముతో సహా హతమార్చి దేవరాజ్యమును నిష్కంటకముగా జేసెను.

## నరసింహావతారము

కొంతకాలము గడచిన పిదప హిరణ్యాక్షుని సోదరుడైన 'హిరణ్యకశిపు' అను దానవేంద్రుడు సురులెల్లరను జయించి ముల్లోకములకు తాను అధిపతియై యుండెను. ఆతని పుత్రుడు ప్రహ్లాదుడు పరమభాగవతాగ్రేసరుడు. ఆతడు పసితనమునుండియే విష్ణుమూర్తి పరమభక్తుడు. సదా నారాయణునే ఆతడు స్మరించుచుండెను. తన పుత్రుడు భాగవతుడగుట హిరణ్యకశిపునకు పరమకోపము. పుత్రునిభగవచ్చింతనుండి తప్పించుటకై ఎంతయో ప్రయత్నించెను. కాని లాభములేకపోయెను. అంత వానినిభయపెట్టి నానావిధముల హింసించెను. తండ్రి హింసించిన కొలది ప్రహ్లాదునకు భగవంతునియందు భక్తి పెరుగుచునే యుండెను. ఆయన తండ్రితో చెప్పుచుండెడివాడు. నాయనా, విష్ణుమూర్తియనిన నీకెందుకంత ద్వేషము. ఆతడు పరమకారుణికుడు భక్తవత్సలుడు. అంతటా వ్యాపించియున్నవాడు. పరాత్పరుడు. అట్టివానిని దూషించవచ్చునా ? విష్ణునామముచ్చరించుసరికి పరమక్రుద్ధుడగు హిరణ్యకశిపు ఒకరోజున ప్రహ్లాదునితో, పుత్రా, విష్ణుమూర్తి సర్వవ్యాపియని చెప్పుచున్నావే, ఆయనను ఎదురుగానున్న స్తంభములో జూపుము అని చెప్పెను. విష్ణుభగవానుడుకూడ స్వర్గరాజ్య విహీనులైన సురులచే ప్రార్థితుడై హిరణ్యకశిపును హతమార్చుటకై సమయమునకై వేచియుండెను. సురులచేగాని, దానవులచేగాని చావురాకూడదని హిరణ్యకశిపునకు బ్రహ్మవరమున్నది. కావున విష్ణుమూర్తి సగమునరుడు సగము సింహముగ నరసింహావతారమెత్తి ఎదురుగానున్న స్తంభమును చీల్చుకొని వచ్చి హిరణ్యకశిపును హతమార్చి సురులను విష్ణుభక్తులైన ప్రహ్లాదాదులను రక్షించెను.

## వామనావతారము

పూర్వకాలమున బలిచక్రవర్తి యుద్ధములో సురులనోడించి స్వర్గరాజ్యలక్ష్మి ననుభవించుచుండెను. అపుడు రాజ్యభ్రష్టులైన సురులు విష్ణుమూర్తిని శరణుజొచ్చిరి. విష్ణుమూర్తి సురుల కభయమిచ్చి అదితికశ్యపులచే స్తుతింపబడి వారి గర్భమున వామనుడై పుట్టి బలిచక్రవర్తి యజ్ఞముచేయుచుండ రాజద్వారమునకు వెళ్లి వేదపఠనము చేయనారంభించెను. వేదపఠనము చేయుచున్న యా వటువునుచూచి బలిచక్రవర్తి శుక్రాచార్యునిచే నివారింపబడుచున్నప్పటికి నీకేమి కావలయునో కోరుకొనుమని యడిగెను. అపుడు వామనుడు దానవేంద్రా, నా గురువుగారి నిమిత్తము మూడడుగుల ప్రదేశమును నాకిప్పింపుమని కోరెను. అట్లేయని చెప్పి బలిచక్రవర్తి నీళ్లు ధారపోసెను. బలిచక్రవర్తి నీళ్ళు ధారపోసినవెంటనే వామనరూపియైన విష్ణుభగవానుడు వామనరూపమును విడచి విశాలరూపియై ఒకపాదముచే భూలోకమును, రెండవ పాదముచే అంతరిక్షలోకమును, మూడవ పాదముచే స్వర్గలోకమును ఆక్రమించి బలిచక్రవర్తిని పాతాళలోకమునకు పంపివేసెను. ఈ విధముగ విష్ణుభగవానుడు వామనావతారమునెత్తి యింద్రాదులకు స్వర్గరాజ్యము నప్పగించెను. దేవేంద్రుడు సురలతోకూడి విష్ణుమూర్తిని స్తుతించుచూ ముల్లోకములకు అధిపతియై హాయిగనుండెను.

## పరశురామావతారము

దేవవిప్రాది పాలకుడైన శ్రీ మహావిష్ణువు క్షత్రియులెల్లరు మదమత్తులై యున్నారన్న సంగతి తెలుసుకొని భూభారమును తగ్గించుటకై జమదగ్ని రేణుకలకు పుత్రుడై పుట్టి పరశురాముడను పేరుతో ప్రసిద్ధికెక్కెను. అదేకాలములో కార్తవీర్యుడను రాజు దత్తాత్రేయ మహాముని యనుగ్రహమువలన వెయ్యి బాహువులు గలవాడై సప్తభూమికి యధిపతియై యుండెను. కార్తవీర్యమహారాజు ఒకదినమున అడవికి వెళ్లి వేటచేసి మిక్కిలి యలసినవాడైయుండ యదేవనమునందు నివసించుచున్న జమదగ్నిమహర్షి రాజును ఆహ్వానించి కామధేనువు ప్రభావముచే

ససైన్యుడైన కార్తవీర్యమహారాజును విందు చేసెను. విందారగించిన మహారాజంతటితో సంతసించక కామధేనువును తనకిమ్మనమని మహర్షిని యడిగెను. మహర్షి కామధేనువు నిచ్చుట కంగీకరింపలేదు. అంత కార్తవీర్యార్జునుడు రాజ్యమదమత్తుడై బలాత్కారముగ కామధేనువు నపహరించి తీసుకొనిపోయెను. జమదగ్ని మహర్షి యేమియు చేయజాలక యూరకుండెను. కొంత తడవు పోయినపిదప పరశురాముడు ఆశ్రమమునకు తిరిగివచ్చి తనతండ్రికి జరిగిన యవమానమును దెలుసుకొని వెంటనే కార్తవీర్యార్జునుని మీదకు యుద్ధమునకు వెళ్లి యుద్ధములో కార్తవీర్యుని శిరస్సు ఛేదించి కామధేనువును తన యాశ్రమమునకు తీసుకొని వచ్చెను. ఒకానొకదినమున పరశురాముడు ఆశ్రమమున లేనిసమయమున కార్తవీర్యార్జునుని పుత్రులు జమదగ్ని మహర్షిని చంపివేసిరి. పరశురాముడు వనమునుండి తిరిగివచ్చి మృతుడై పడియుండిన తండ్రినిగాంచి పరమక్రుద్ధుడై యిరువదియొక్కసారి క్షత్రియవంశమును నాశనముచేసెను. అనంతరము పరశురాముడు కురుక్షేత్రమున అయిదు కుండములను స్థాపించి వాటియందు పితృతర్పణము గావించి కాశ్యపమహర్షికి భూమినంతను ధారపోసి తపస్సు చేయుటకై మహేంద్రపర్వతమునకు వెడలిపోయెను.

(సశేషము)

---

# సదాచార సూత్రములు

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

(గతసంచిక తరువాయి)

45. సత్పురుషుడై ప్రేమికుడైనవాడు దుఃఖమందు సయితము దయాప్రేమలను విడిచిపెట్టడు.
46. ఉదారుడైన బుద్ధిమంతుడు విరోధియైన, మిత్రత్వానికి యోగ్యుడు.
47. న్యాయ, స్నేహ, ఉత్సాహ కర్తవ్య, బుద్ధి, విద్య, ప్రేమలుకల పురుషుడు దేవతాసదృశుడు.
48. బాగుగా ఆలోచించి స్నేహంచెయ్యాలి, సత్యమైన మిత్రునికన్న ప్రపంచంలో సుఖ మేదీ లేదు.
49. కులంయొక్క సదాచార, అధికారాలను సదా సంరక్షించాలి.
50. దేశకాల పాత్రయోచనకల పురుషుడు ఆనంద మురళిని మ్రోయిస్తాడు
51. తన దోషాలు తెలియగానే వాటిని త్యజించ ప్రయత్నించడం నిజకర్తవ్యంగా భావించాలి.
52. ఆగ్రహవశులై ఉచితవచనాలను అంగీకరించని మానవులు అంతమందు కార్యం నశించిన మీదట పశ్చాత్తాపము చెందుతారు.
53. ఆశాలేశమున్నంతవరకూ ప్రయత్నం చేయక ఉండరాదు.
54. ఏ ప్రాణితోనూ విరోధం కలుగకుండుటయే పరమచాతుర్యం.
55. అత్యంత కష్టపరిస్థితులలోకూడా ధైర్యాన్ని విడువని వాడై విజయశ్రీని సముపేతుడౌతాడు.
56. అప్రియవచనాలు పలికే పురుషుడు అందరి హృదయాలకూ కంటక సదృశుడవుతాడు.

(సశేషము)

# అభినందనము

శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మ



[ శ్రీమతి సారస్వతసోదరి నందూరి చంద్రమతిదేవి రచించిన శాంతివిజయ కావ్యమును చదువుటచే కలిగిన ఆనందపారవశ్యమునకు అక్షరరూప ప్రతిబింబము — ఈ రచన. ]

౧

జననీ! ఆంధ్రమహాకవిత్వ పదవీ సామ్రాజ్ఞి! నీ కావ్యమె
ల్లను మాధ్వీకము; శారదా చరణలోలన్మంజు మంజీర ని
స్స్వనముల్ నీదు కవిత్వ వైభవములుత్పాదించు మారంద వా.
హినులన్మున్కలువెట్టి, యార్ద్రహృదయోత్సేధంబు నందృప్తిమై

౨

ఆకంఠమ్ముగ నాస్వదించి, భవదీయానూనభావాబ్ధి హే
వాకప్రాంచదమేయ శాంతి విజయవ్యాహార మాయాంధ్ర వా
ణీకలకంఠి చంద్రమతియై నిండారు మోదమ్మునన్
మా కన్నుంగవ వెల్గుచూపినని యంతర్వాణులగ్గింపగా

3

మోదమునంబరించి. ముదముం బ్రకటింపక యుండలేక, యే
వో దొరకొన్నమాట లొకటోయదొ యేరిచి కూర్చినాను; సం
పాదిత పూర్వపుణ్య విభవప్రభవమ్మది నీ కవిత్వ భా
గ్యోదయ మంబుజోదర పదోత్థిత గాంగఝరీ సకాశమున్.

౪

అమల సారస్వతానుబంధాళి గూర్చు
జన్మజన్మాంతరముల సంస్కారము; అక్క!
తనివి నొందుటకాని యీ తెనుగు తమ్మ
డెట్టు లగ్గింపగలడు! నీ కృతి బెడంగు.

౫

అక్కవో! చెల్లివో! యెరుగ; నైనను పోయినదేమిలే! భవ
ద్వాక్కమనీయ వైఖరుల ప్రాక్తన సోదరభావ మేదియో
యొక్కటదోచి మెప్పులకు నొప్పక యిప్పగిదిన్ రచింపగా
మక్కువగొల్పె; దాన ననుమానము లేక వచింతు సోదరీ!

౬

'నీ కడుపు చల్లగా, మరి నిన్నుగన్న
కడుపు చల్లగా' నూరేండ్లకాల మీవు
పసుపు కుంకుమములతోడ పరిఢవిల్లి
యింపుగుల్కు కృతుల్ సంతరింపుమమ్మ.

౭

పసుపు కుంకుమమ్ము పదివేలుగా చూచు
అనుగు తెనుగువారి యాడుబిడ్డ
వగుట నాదరమ్ము ననురాగ మెసగంగ
నవియె పంపినాను పాయసముగ.

౮

అట వెలదిచేత తేటగీతుల నుత్ప
లములబెట్టి చంపకముల నొసగి
పులిని కాపువెట్టి పారిభద్రగజముపై
నంపినాను గొనుము పాయసమ్ము.

౯

తీరిక యుండునేని, మది తీయము, నెయ్యము గల్గునేని, యొం
డారయ కుందువేని, జననాంతర సౌహృద మెల్లవారికిన్
కూరుచు చుట్టమన్న కవికుంజరు వాక్యమెరుంగుదేని, నీ
వూరకయున్న యప్పుడొక యుత్తరమంపుము చాలు సోదరీ!

౧౦

'పొసగ ముత్తెపుసరుల్ పోహళించిన' శబ్ద
రామణీయతకు శ్రీరామరక్ష
తరిపి వెన్నెలలోని తారళ్యమొడియు ప్ర
సన్నశైలికి శుభాశంసనమ్ము
కవిరాజులకు తలల్ కంపింపజేయు భా
వావేశమునకు సర్వాభ్యుదయము
ఎంతవారికిని నోరూరించు సత్కవి
త్వాహార్యమునకు ననామయంబు
నగునుగావుత, సకల లోకాశ్రయుండు
మా కులస్వామి సర్వకర్మైకసాక్షి
జీవలోకమ్ము కనువిప్పు శివకరుండు
పద్మవన బాంధవుండు సర్వాంగరక్ష.

# చీకటి రోజులు

శ్రీ అయిరాల రాజారెడ్డి

'నాన్నా, నన్ను హైస్కూలుకు పంపవూ!" లాలనగా అడిగింది లక్ష్మి తండ్రి వొడిలో కూర్చొని. తండ్రి దీర్ఘంగా యోచిస్తున్నాడు. 'నేను ఐదవ క్లాసులో అందరికన్నా ఎక్కువ మార్కులు తెచ్చానని మా మాష్టరుగారు చెప్పారు.' అంటూ తండ్రికేసి చూసింది లక్ష్మి. అతను మౌనంగానే యున్నాడు. తండ్రి గడ్డాని తనవైపుకు త్రిప్పుతూ – 'చూడూ, చంద్రబాబు, షావుకార్ కుమార్తె లలిత, సూర్యం, వాళ్లంతా హైస్కూలుకు వెళ్తారట!... ఏం నాన్నా నన్నుకూడా పంపవూ' కొంచెం వాడిన మోముతో అనింది. తండ్రి మౌనవ్రతాన్ని వీడలేదు. లక్ష్మి ఆశగా తండ్రి ముఖానికేసి తన చల్లని చూపుల ప్రసరింపచేసింది. ఒకసారిగా అతని తలను ఊపేసింది. 'ఏం చెప్పవూ? నన్ను స్కూలుకు పంపెదవా? లేదా?... చెప్పవేంటీ?'... కోకిల కంఠంతో మృదుమధురంగా అనింది. ఆ మృదుమధురమైన కోకిలస్వరంతో చిలుకపలుకులు పలికే ముద్దుల లక్ష్మికేసి ఒకసారి చూశాడు రామయ్య. అతని యోచనాతరంగాలన్నీ తక్షణమే ఎగిరిపోయినై. కుమార్తె ఆనందానికై 'అలాగేనమ్మా, నిన్నూ బడికి పంపుతాలే'... అన్నాడు రామయ్య కుమార్తెనుద్దేశించి. లక్ష్మి తక్షణం తండ్రి వొడిలోనుండి ఒక గంతువేసి నిల్చొని– 'ఎప్పుడో కాదు నాన్నా, రేపే, తెలుసా!'... అనింది తలఊపుతూ వయ్యారంగా. 'అలాగే రేపే వెళ్లుదువులే' అన్నాడు రామయ్య. లక్ష్మి మనసు ఆనందంతో వోలలాడిపోయింది. ఆమె గంతులువేస్తూ వీధిలోకి వచ్చింది. వీధిలో తన స్నేహితులెవరూ లేరు. సూర్యం ఇంటికి వెళ్లింది. 'ఏయ్ సూర్యం' గట్టిగా పిల్చింది. సూర్యం గబగబా వచ్చి లక్ష్మిచేయి పట్టుకొన్నాడు. 'మాద్రా సూర్యం, మానాన్న హైస్కూలుకు పంపిస్తాడట. రేపే మీతో వస్తానురోయ్.' చిరునవ్వు చిందిస్తూ చెప్పింది లక్ష్మి. సూర్యం, లక్ష్మి ఇద్దరూ గంతులువేస్తూ వీధిలోకి వచ్చారు. తోడిబాలలు కొందరు గిల్లికజ్జాలాడుతున్నారు. 'సూర్యం, ఏయ్ లక్ష్మి రావే అల్లిబిల్లి ఆటలు ఆడుకుందాం' అని పిలిచింది లలిత. లక్ష్మి, సూర్యంలు చకాచకాపోయారు. 'ఏయ్ లలితా నేనూ రేపు మీతో హైస్కూలుకు వస్తానే.' సంతోషాన్ని వెలిబుచ్చింది లక్ష్మి. ఆశ్చర్యంగా లక్ష్మికేసి చూసింది లలిత. హైస్కూల్లో ఈలా దోబూచులాడేది అరుదుగా వుంటుంది. అన్నీ ఆటలు ఈరోజే ఆడుకొందాం రావే'- అని పిలిచింది లలిత. సూర్యం, లలితలు లక్ష్మి కళ్లకు గంతలు కట్టారు. 'దాగుడుమూత దండకోర్ – పిల్లివచ్చా ఎలుకా భద్రం'– భావగీతాల పాడుతూ ఆనందంగా ఆటలాడుతున్నారు. లోకానుభూతిలేని అజ్ఞానబాలలకు ఆనందంగాక – చింతేమిటికి? కష్టసుఖాలెరుగని కోమలాంగులు, కమనీయహృదయులు.

♦ ♦ ♦

రామయ్య ఒక నిరుపేద. కట్టెలమ్మిన డబ్బుతో తన సంసారాన్ని పోషించేవాడు. అంతకుతక్క ఇంకేమీ ఆదాయములేదు. లక్ష్మి తన ముద్దుల కుమార్తె. కట్టెలమ్మినడబ్బుతోనే కుమార్తెకు పలకా పుస్తకములు వగైరాలు తెచ్చి ఎట్లో స్వగ్రామంలో ఐదవక్లాసువరకు చదివించాడు. నిజంగా లక్ష్మి చాల తెలివైన పిల్లే – కానీ ఉన్నతపాఠశాలకు పంపడానికి డబ్బులేదు. దీర్ఘంగా యోచించాడు రామయ్య. లక్ష్మి ఆనందానికై అప్పుడలా అన్నాడు కానీ – తనేవిధంగా లక్ష్మిని చదివించేది?... తన్ను తన భార్య సంపాదించే కనీసపు డబ్బు తిండికే చాలదు. నిలిపివేస్తే నాలక్ష్మి ఆశ అడియాశై పోతుంది. ఆమె అన్నపానాదులు మానేసి కలవరిస్తూ కన్నీటి భాష్పాలు రాలుస్తుంది. అతనికి ఆమె దుఃఖించుట సహింపరానిది. ఆమె ఆనందమే తన ఆనందం, తన ఇంటికే ఆనందం. ఏమైనా కానీ లక్ష్మి నెలాగైనా చదివించాలనుకొన్నాడు. ఆరోజు సాయంత్రం క్రొత్త రవికపావడా కుట్టుకవచ్చాడు.

♦ ♦ ♦

లక్ష్మి రోజూ ఉన్నదుస్తులతో బాగా ముస్తాబై తన తోడివారితో బడికి వెళ్లేది. ఈలా రోజులు సునాయాసంగా దొర్లిపోతున్నయ్. ఒకసంవత్సరం

ఆనందంగానే గడిచిపోయింది. ఓ రోజు లక్ష్మి ఇంటికి వస్తూ 'నాన్నా నాన్నా- నేను ప్యాస్— నేను ప్యాస్— ఇప్పుడు నేను సెకండుఫారమ్— అంటే ఏడవ తరగతి నాన్నా' అనింది చిరునవ్వులు చిందులు త్రొక్కుతూ. రామయ్యకు ఒకప్రక్క ఆనందం మరో ప్రక్క విచారం ఆవరించుకొన్నది. 'నాన్నా జమీందారు కూతురు చంద్రక్క మద్రాసులో చదువుతున్నది. నన్నూ ఆలా చదివించవూ... ఏం నాన్నా' ఆనందంతో తన అంతరంగిక కోరిక చెప్పింది. రామయ్య లోలోన నవ్వుకొన్నాడు. 'పిచ్చితల్లీ! డబ్బున్నవాళ్లు ఎక్కడైనా ఎంతవరకైనా చదువుతారు. డబ్బులేని మనలాంటివారు??... మాట ముగియకమునుపే. 'నాన్నా ఒక లేడీ డాక్టర్ని కావాలి నాన్నా... ఆలా అయితే అందరికీ మంచి మందులివ్వనూ... చెప్పు నాన్నా' ... తన ఉద్దేశ్యాన్ని వెల్లడిచేసింది లక్ష్మి. చిరునవ్వుతో 'ఆలాగే' అంటూ దీవించాడు రామయ్య. 'డాక్టరిని ఐతే మానవసేవ చేయుటకు అవకాశముంటుంది. మన జీవితము గడిచిపోతుంది. వృత్తితో బాటు సేవ అన్నారు మా ఉపాధ్యాయులు — అందుకే చదివించాలి?... ఆఁ... గంతులువేస్తూ వెళ్లిపోయింది లక్ష్మి.

♦ ♦ ♦

ప్రతిమానవుడూ అంతే. అందరూ సదుద్దేశాన్నే కోరుతారు. అందరూ అందల మెక్కాలంటారు, గొప్పకీర్తిప్రతిష్ఠలు లేవాలంటారు. గొప్ప రాచతంత్ర నిపుణుడుగా తయారు కావాలనుకొంటారు, కవనములు వ్రాయు మధురకవిగా సార్జించాలనుకొంటారు. కానీ వారనుకొనునట్లు - అందరూ ఆలా అయిపోరు. ఏ కొద్దిమందో మంచికీర్తి సార్జింపవచ్చు. అట్టివారిని వ్రేళ్లపై లెక్కచెప్పవచ్చు. కానీ ఎవరూ తాను పోకిరి కావలయునని, దొంగగా, రౌడీగా తయారు కావలయునని (ఎవరూ) తలంచరు. విధి విధానం - పరిస్థితులబట్టి ఆలా తయారైపోతారేమో....

♦ ♦ ♦

లక్ష్మి రెండవఫారం చదువుతున్నది. ఆ వత్సరం భూదేవిని క్షామదేవత రాజ్యపరిపాలన చేసింది. ఆకాశాన నల్లని మబ్బులుకూడా లేవు. పగలు సూర్య భగవానుని వేడిమికి ప్రజలు భగ్నమైపోతున్నారు. పెద్దనదులలో సైతం జలాలింకిపోయినై. ఎటు చూసినా స్మశానం పగిది ఎండిబూడిదగా కనుపించు ఇసుకరేణువులే_ ఎటువిన్నా ఈతిబాధలే. ఆకలి మంటల రొదలే. అన్నానికే అలమటిస్తుంటే - కట్టెలెందుకు? రామయ్య బ్రతుకుతెరువు చాల కష్టమయింది. తన ముద్దుకుమార్తె నేలాగు చదివించేది?... కట్టుటకు దుస్తులా?... లేవు. ఎట్లు? లక్ష్మిని బడి నుండి నిలిపివేయాల్సిందేనా?... ఆమె ఆశలు అడియాశలేనా?... ఎట్లు వారేమార్గంగా చరివేది?... ఇదే సమస్య అతనిలో నాటుకొంది. విధిలేక లక్ష్మిని బడినుండి నిలిపివేశాడు. లక్ష్మి బోరున ఏడ్చింది. కొన్ని రోజులు అన్నమే హితవుకాలేదు. తోడివిద్యార్థుల చూసి ఆ బాలమనసు తహతహలాడిపోయింది. చదువకుండాయున్నచో మూర్ఖులవలె ఆలా వెత చెందక యుండవచ్చు. కొంచెము విద్యనర్జించి, విజ్ఞాన పథాన్ని గుర్తెరిగినతర్వాత — ఆ దారినే పోకుండా విద్యకు స్వస్తిచెప్పడం అంటే- ఎంతో జీవితానికి బాధ కలిగిస్తుంది. ఆ బాధ చెప్పనలవికాదు - ఆలాగే లక్ష్మి తనరోజులు నతికష్టంతో ఎదుర్కొంటున్నది.

♦ ♦ ♦

రామయ్య మంచంపై మూల్గుతున్నాడు. రామయ్య భార్య మంచానికి చేరువ కూర్చొనియుంది. లక్ష్మి, నాన్న మోకాళ్ల చెంత మంచంమీద కూర్చొనియుంది. రామయ్య మంచంపట్టి ఇప్పటికి నాల్గు రోజులవుతున్నది. త్రాగుటకు గంజిలేదు. ఆ కుటుంబమే మలమల మాడిపోతున్నది. ఆకలిమంటలచే, ఈలా ఎన్ని కుటుంబాలు ఈ దీన భారతావనిలో ఉన్నాయో కదా?... వారి గతేమి?... వారికి జీవనోపథం ఎట్లు?... ఒకవైపు ఆకలిబాధచే మరొకవైపు జ్వర బాధచే చాల నీరసంగా అయిపోయాడు. 'అమ్మా ఎట్లైనా వెళ్లి ఆ మంచినీటి మందైనా తీసుకరాబో తల్లీ?'— చాలాహీనంగా, డగ్గుత్తిక స్వరంతో దీనంగా అనింది లక్ష్మితల్లి. లక్ష్మి వెంటనే వెళ్లిపోయింది.

♦ ♦ ♦

డాక్టర్ ఇంకను మందిచ్చి పంపలేదు. లక్ష్మి ఒక గంటకాలంగా అచ్చట_కాచుకొంచో ఉంది. తనకన్నా వెనుక వచ్చినవారికి ముందుగా మందు లిస్తున్నాడు. అందరువెళ్లగా తనొక్కతే మిగిలింది. 'ఏంటీ ఏలాఉంది అతనికి?' సింహంవలె గర్జిస్తూ అడిగాడు డాక్టరు. నెమ్మదిగా అడిగి తెలుసుకోవటం వైద్యుని ధర్మం. అధికారగర్వంతో అలా అరుస్తే లేనివారికిసైతం జబ్బురాదా మరి. 'అట్లేఉంది నయం కాలేదండీ!' నెమ్మదిగా అనింది లక్ష్మి. డాక్టరు తల ఊపుతూ, 'కాలేదా' అంటుండగానే కాగుతో

ఎవరో వచ్చారు. 'గుడ్ మార్నింగ్' అంటూ వారికి ఘన స్వాగతమిస్తూ లోనికి తీసికొనిపోయాడు డాక్టరు. లక్ష్మి ఒకసారి ప్రభుత్వ వైద్యశాలల గురించి తలంచింది. 'వైద్యశాలల పేరుమాత్రం ధర్మమునకే. కానీ డబ్బుగలవారికే, మంచిమందులు. అది లేనివారికి నీళ్లే శరణ్యము. లోకంలో ఎక్కడా పేదలకు స్థానం లేదు. వారికి విలువేలేదు. కనీసపు గడ్డిపోచకైనా విలువుంది. కానీ కడుపేదలకు ఆ విలువకూడా లేదు. లక్ష్మి మరల అర్ధగంట కాలం అచ్చటే ఉండిపడి. లోనికేగిన డాక్టరు ఇంకనూ రాలేదు. తండ్రి ఏలా ఉన్నాడో?... జ్వరబాధచే శరీరం చాల తీవ్రముగా అట్టుడుకినట్టుడికిపోతూ ఉండడానే — ఏలా ఉందో - ఈ దున్నపోతు డాక్టరు ఏంటీ ఇంకా రాలేదు. వీరికేం తెలుసు బీదల బ్రతుకుతెరువు?... గట్టిగా అరుస్తా'... ఏమనుకుంటాడో... ఏమైనా అనుకోనీ— 'సార్... సార్...' అరచేటంతకైనా ఆలీ ఉండదూ. 'సార్' మరింతగట్టిగా పిలిచింది. అబ్బ! ఎంత చవిటిమొద్దు. కాదు అహంభావం. ఆఁ?... అహంభావంకాక మరేమి?... పేదలు సరిగా వైద్యశాలలకు రాడు. వస్తే బీదలమూకే. వారికి సేవచేయటమే పట్టదు. ఏమైనా డబ్బులు చేతిలో పడుతాయా అని చూస్తూంటాడు. ఎవరైనా బంధువులొస్తే ఈగది వదలి తనగదికి (లాడ్జింగ్) వెళ్లే. ఇదే డ్యూటీ? ఇందుకే ప్రభుత్వం జీతాలిచ్చి పల్లెటూళ్లలో పెట్టింది. ఎక్కడా న్యాయం?... ఎక్కడివా మందులు?... ఎక్కడిదా డబ్బు? వాని సొమ్మా? అంతా ప్రజలదే... పళ్లు పటపటా కొరికింది. మరీకొరికితే దంతవైద్యునిదగ్గరకు పోవల్సిందే. వాడూ డబ్బులేందీ (చేయడు) పాపం. పేదవారికోపం పెదవికిచేటు. లక్ష్మి దీర్ఘంగా యోచిస్తున్నది. టకటకా వచ్చాడు డాక్టరు బూట్లు చప్పుడుచేస్తూ. లక్ష్మి లేచింది. డాక్టర్ లక్ష్మివైపు చూసి. 'నీవింకను ఉన్నావా?... అంటూ నీళ్ల మందు బాటల్లోపోసి ఇచ్చాడు. లక్ష్మి మందును తీసికొని ఇంటిముఖం పట్టింది.

♦ ♦ ♦

రామయ్య జీవితం ఒక హరికేన్లాంపు వంటిది. అందులో కిరసన్ అయిపోయింది, ఇక ఒక సెకండుకో లేక అర్ధసెకండుకో జ్యోతి ఆరిపోతుంది. అంతే అతను. ఇక కొద్దికాలమే జీవించగలడు. అతడు కడసారి వాంఛ తన ముద్దుల లక్ష్మి వదనం... 'లక్... ష్మీ'... ఊపిరి ఉగ్గపట్టి అస్పష్టంగా — అన్నాడు. 'లక్ష్మి లేదు వచ్చేస్తుంది.' నిరాశనుకల్గించే ఈ మాటలు మాత్రం వినబడ్డాయి. జీవితంపై ఆశ వదులుకొన్నాడు. ఈ మానవకూటమినుండి వేరైనాడు. ఇప్పుడతడు పిలిచినా పలుకడు. లక్ష్మి గసపోసుకొంటూ ఇంటిలోనికి వచ్చింది. అమ్మ బోరున ఏడుస్తున్నది. 'నాన్నా... నాన్నా'... గట్టిగా అరుస్తూ అతని శరీరంపై వాలిపోయింది.

♦ ♦ ♦

తన తండ్రి దేహానికి దహన కార్యాలు చేయించింది— లక్ష్మి. తన జీవితపథాన్నిగూర్చి దీర్ఘంగా యోచించింది. అబల. యౌవనపుచాయలిప్పుడిప్పుడే తనలో అంకురిస్తున్నయ్. ఇంతకముందు ఒకరకం. ఇప్పుడు తన మానాన్ని సంరక్షించుకోవాలి?... ఎట్లు?... ఇదే ఆలోచనలు ఆమెలో చెలరేగినై. ప్రపంచంలో పనిచేసికొని బ్రతుకరాదా?... కూలికి పిలిచేవారెవరు?... కడుపే కైలాసంగా ఉంది ప్రతి వొక్కరికీ. ఏది ముందు? మానసంరక్షణమా?... ప్రాణసంరక్షణమా?... తల్లిని — తన చిన్నారితమ్ముని — సంరక్షించుటే తన కర్తవ్యం... గుండెనిబ్బరం చేసికొని - ఇల్లువీడి ధర్మంసేయుమని అడుగుతూ వెళ్లింది. ఉన్నా లేదంటారు రాతిగుండెలవాళ్లు. కఠినులు, దోసకారులకే తోడైవచ్చు దైవమ్మ... ఉన్నవారు లేదంటారు. లేనివారు పట్టిచేతులు చూపిస్తారు. లక్ష్మి తన చిన్నతనం, తన విద్యాభ్యాసం, తన వాంఛ రీల్సువలె తన కంటికగుపడినై. కన్నీరు కాల్వలై పారింది. గతాన్ని తలచి వగచుట తప్పు అనుకొంది. గుమ్మం గుమ్మం తిరిగింది.... నిరాశ... నిస్పృహ...ఎవరూ చీదరించుకొనువారే. భారతదేశం దాతలకు పుట్టినిల్లు గదా?... వారేరి?... లక్ష్మికి నీరసం ఎక్కువైపోయింది. ఎవరో... పాపం. ఆమెపై ఒక అంగవస్త్రాన్ని వేశాడు. సంతసంతో లక్ష్మి తీసికొంది. ఎందరో తన ఎదురుగా వస్తున్నారు, పోతున్నారు. కొందరామెవైపు చూసి అసహ్యించుకొంటున్నారు. మరికొందరు చూడలేకనే పోతున్నారు. అబ్బ! ఎన్నిరకాల మనుషులు. సైకిళ్లపై పోయేవారు, బండ్లమీద పయనించేవారు, కారుల్లో, ట్రాంబండ్లలో...మున్నగు వాహనాలపై పోయేవారు? అందరూ ఆమెకు అగుపడ్డారు. భోగం రంగసాని గుఱ్ఱపుబండిపై బాగా ముస్తాబై వస్తుంది. లక్ష్మి మనసు ఆమెపైకి మరలింది. 'ఆమె కెక్కడిది డబ్బు?... ఆమెశరీరాన్ని అద్దెకిచ్చిన ఫలితంగానేగా అలా సుఖభోగాలతో తులతూగుతుంది. నేనూ అలామారితే... 'అగు'... మనసు ఒకసారి హెచ్చ

రించింది. 'తప్పుత్రోవలో నడవవద్దు.'... తల్లిని, సోదరుని పోషించుటకై అలాచేస్తే ఏం?... నేనూ మానవస్త్రీనేగా. అందం లేదా?... వయస్సు లేదా?... మరేమి?... ఈ చిన్నవస్త్రాన్ని స్నానం చేసి ధరించి నేను ఆ ఆట ఆడితే ఏం?...' తనలో అనుకొంది లక్ష్మి. మనసు ఇలా హెచ్చరించింది.... 'నారుపోసిన దేవుడు నీరుపోస్తాడు... అందరూ నీ విధంగా తలిస్తే దేశం ఏంకావాలి?... ఈ నీచపు బ్రతుకు బ్రతుకుటకన్నా నిలువునా మాడిపోతే ఏం?"... 'ఐతే మా తల్లిని, సోదరుని సంరక్షించు టెట్లు?' ఐతే పతితవై పోవాలని తలస్తున్నావా? భారతనారీమణులకు శీలమే రత్నహారం. దాన్నే తృణీకరిస్తే-నిజంగా అది మానవస్త్రీకాదు 'రాక్షసి'. ప్రపంచంలో అందరూ శీలాన్ని కాపాడుకొంటు న్నారా? అందరూ అలా అనుసరింపక పోవచ్చు. వారితో పనివద్దు. ఉత్తమజీవిత పథాన్నే నీవు అను సరింపు, ఆ నాడే నీవు జ్యోతివలె వెలుగుతావ్. ఆ నాడే నీవు మహిళలకందరికీ దారి చూపుతావ్. నిన్నే ఆదర్శంగా తీసికొంటారు. నీ జీవితగాథే వారికి పాఠం నేర్పుతుంది. పతితగా జీవించుటహేయం. నీచాతినీచం. అదినరకం' లక్ష్మి దాన్ని తిరస్కరించింది. ప్రొద్దుపోతున్నది. తిన్నగా దారిన పోతున్నది లక్ష్మి. కడుపులో ప్రేగులు ఆకలిబాధచే రొదచేస్తు న్నయ్. ఆమె పరిపరివిధాలయోచించింది. ఇప్పుడామె యోచించనూ లేదు. గతాన్ని తలచి చింతించనూ లేదు. నిరాశగా అడుగుపై అడుగేసుకొంటూ ఇంటిదారి పట్టింది లక్ష్మి.

♦ ♦ ♦

నిర్మలమైన ఆకాశంలో మబ్బులు దోబూచు లాడుతున్నయ్. ఉరుములతో మెఱపునాట్యం చేస్తు న్నది కొన్ని వత్సరాలుగా వర్షంలేక ఎండి - ఇసుకై పోయినభూమి - అందులోని వేడి ఆవిరిపై కెగసిపోతున్నది. ప్రజలంతా ఆకాశానికేసిచూస్తూ అదో ఆశగా వానకై నిరీక్షిస్తున్నారు. ఇకకరువు లేదు. కుంభవర్షం పడ్తుంది. ఏరులుసాగుతాయ్. బంగారు పంటలుపండుతాయ్. ఇక కరువురాదు. చీకటి చీల్చుకుపోతుంది; వెన్నెలరోజులువస్తాయి. అనుకొంటున్నారు ప్రజలు.

♦ ♦ ♦

లక్ష్మి రోడ్డుమీద తూలుతూ నడుస్తున్నది. ఆమె కురులు గాలికి చెల్లా చెదరైనాయి. శరీరం కృశించి పోయింది. కళ్లు గుంతలు పడినై. చెక్కిళ్లు ఎండి పోయినై - ఆమె దేహం మాలిన్యంతో ఉంది. చినిగిన చీర గాలిలో తేలియాడుతున్నది. ఆమె కిప్పుడు ప్రపంచంతో పనిలేనట్లున్నది. అతినీరసంతో ఉన్నందుచే కళ్లకు అడ్డంగా తెల్లటితెరలు కట్టినట్లుంది. ప్రపంచమే గిర్రున తిరుగునట్లనిపించింది లక్ష్మికి. కారుసబ్దం వెనుకనుండి ఆలించింది. తొట్రుపాటుతో తప్పుకోపోయింది. హీనశక్తిచే బోర్లకిల పడిపోయింది. తక్షణం కారు ఆమెపై వెళ్లిపోయింది. కొంత దూరంలో కారు ఆగింది. కారులోని పెద్దమనుషులు ఆమెను చూశారు. ఎవరూ వారిని చూడనట్లుంది. అందుకే ఆమె విషయమై ఆలోచించనేలేదు ఐశ్వ ర్యంతో అంధులైన పెద్దమనుషులు. తక్షణం గాలివోలె పరుగిడిపోయింది కారు. పేదవారికి ముక్తిలేదేమో!... వారికెప్పుడీలాంటి చీకటిరోజులు విచ్ఛిన్నమౌతాయో! ఎప్పుడు వెల్గులో అందరూ ఏకంగా ఆనందంతో తోలిలాడిపోతారో... ఆనాడే దేశమాత శాంతి స్తుంది. ఇది ప్రతిఒక్కరూ స్మరణయుందుంచుకోవాలి.

మబ్బులు మరుగైనాయ్. ఉఱుములు మెఱుపులు పటాపంచలైనాయ్. నీలాకాశంలో సూర్యభగవానుడు ఈ దారుణదృశ్యాన్ని చూడజాలక పడమటి కొండలలోనికి దిగజారిపోతున్నాడు.... ఇక చీకటే శరణ్యం... ఎప్పుడు వెల్గు?



(584 వ పేజి తరువాయి)

లయిన సామాన్యుల దుర్దృష్టస్థితిని గాంచి యితడు, చాల పరితాపపడెడివాడు. మిక్కిలి పరిష్కృతమును, ఆధ్యాత్మిక చింతాసంయుతమును అగు ఆర్యసీమ యొక్క భావ్యభ్యుదయ మన్నివిధముల, అన్యులచే అరికట్టబడుచున్న కాలమున శ్రీరామానుజాచార్యుల యుపదేశమును అచంచలముగ స్థాపించుటకు వేదాంత దేశికుని జన్మ మత్యంతావశ్యకము అయ్యెను.

స్వతంత్ర భారతము, సభ్యత, సుసంస్కారము, ఆత్మవిచారము మున్నగువానికి దూరముగ నిలిచి అట్టి క్లిష్టసమస్యల దీర్పుటలో వేదాంతదేశికుని ప్రబోధములు సహకారములై యుక్తరీతి ప్రజల నుద్ధరించెను. తెంగల్, వడగల్ తెగల వైష్ణవులలోఁ గలిగిన అల్పాల్పములైనవియు, కడుంగడు సంకుచితములైనవియు నగు విభేదములను 'గోరంతలయిన వానిని గొండంతలు'గ నెంచి, అహరహము ఒక తెగవారిని మఱియొక తెగవారు 'దుర్మ్మతి తూరాపర బట్టుటను ఈతఁడు విపరీతమగు మనఃక్లేశముతోఁ బలుతడవలు తెగనాడెను.

"అన్యోన్యవైరజనని విరహాత్యసూయా" అని ఇతఁడు నుడివెను. అనఁగా:—మనలో మనకు వైరము పుట్టించు అసూయ మనలను విడిచిపోవును గాక! మనలోని అన్యమతస్థులు అన్నివిషయముల లోను పైకి మధుర ప్రశాంత చిత్తులుగను, పరమ మైత్రితో మెలఁగువారుగను గనఁబడుచుండిరి.

మనము దేశికులాదేశించిన మతసూత్రములలోని సత్యమును గుర్తించి, తదనుసారము మన యభిప్రాయములను మార్చుకొనఁదగును. అప్పుడే శారీరక మానసిక శక్తుల నభివృద్ధిచేసికొనుటకుఁ దగినంత సామర్థ్యము సాహసము ఐక్యము గల ఆర్యజాతీయతను చక్కటి పద్ధతుల నవలంబించి శాశ్వతముగ నెలకొల్పఁ గలుగుదుము. (సశేషము)



(568 వ పేజీ తరువాయి)

లోకి'' అంటూ స్టేషనుమాస్టరు గదమాయించాడు. వెనుకనుంచున్న ఎవరో ముందుకునెట్టారు రాజును. ఇంతలో రైల్వే పోలీసు అతని జెబ్బపట్టుకొని ముందుకు లాగాడు. రాజు గ్రుక్క తిప్పుకోలేక పోయాడు. కళ్లల్లో నీళ్లు తిరిగాయి. గద్గదికంగా "నేనండీ సుందరంగారబ్బాయిని. L. I. C. లో పనిచేస్తున్నాను. నాపేరు రాజు...'' అన్నాడు. ''అక్కడ చెప్పుకుందువుగాని పద'' ముందుకునెట్టాడు పోలీసు. నిరాశతో నిస్పృహతో ఆమె వంక చూసాడు రాజు. అసహ్యంతో అష్టవంకరలూ తిరిగి ''తూ'' అని ఉమ్మేసేటట్లు ఆమె ముఖంపెట్టింది. ''ఇంకా కదలవేం'' అంటూ తలమీదపడ్డ బరువైన దెబ్బకు రాజు ''అమ్మా'' అంటూ అరిచాడు.

♦ ♦ ♦

నిద్రలో బెంచీమీంచి క్రిందపడిన రాజుకు స్వప్నభంగమయింది. స్టేషనులోకి రైలు అప్పుడే కాలు పెడుతోంది ప్రయాణీకుల హడావిడితో ప్లాట్‌ఫారం సందడిగా ఉంది. తనకువచ్చిన కలను మరచిపోలేక నెమ్మదిగా ముందుకు నడిచాడు రాజు.

శ్రీదేవి ఆడవాళ్ల పెట్టెలోంచి దిగింది. అర్ధనిమీలితాలయిన కళ్లు, అరసున్నల్లాంటి కనుబొమలు. గెడ్డంక్రింద సొట్ట. సొట్టలో కందిగింజంత పుట్టుమచ్చ. ఆమే, సందేహంలేదు. ఎంతగా మారిపోయింది. ఇప్పుడు నన్ను గుర్తుపట్టగలదో లేదో. చిన్నప్పుడు సన్నగా ఈసురోమంటూ ఉండే శ్రీదేవి ఎంత సౌందర్యవంతురాలయింది. గుటకలు మ్రింగాడు రాజు.

రాజుకు ఆమెను సమీపించడానికి మనస్కరించలేదు. స్వప్నం వెనక్కు లాగుతోంది. కలలో తిన్నదెబ్బ జ్ఞాపకం వచ్చింది. కాని ముందుకు నడిచాడు. ఆమెను చూస్తూ నిలబడ్డాడు. ఆమెపేరు నాలుగుసార్లు పెదవి చివరకువచ్చి మళ్లీ లోపలికెళ్లిపోయింది. చింతనిప్పుల్లాంటి కళ్లతో కలలోకన్పడ్డ రైల్వేపోలీసు అతని నోరు నొక్కేసినట్లు నిలబడ్డాడు.

తనకెదురుగా నిల్చున్న రాజును భ్రుకుటి ముడిచి ఎగాదిగాచూసింది. ఆమె ఆశ్చర్యంతో అతనివద్దకు వచ్చింది. రాజు ఆమెను పలుకరిద్దామనుకుంటూనే పలుకరించలేకపోయాడు. కాని అతని కళ్లు మాత్రం ఆమెమీద తదేకంగా నిల్చిపోయాయి.

సజీవ శిలావిగ్రహంవలె నుంచున్న రాజును ఆమె నవ్వుతూ పల్కరించింది. ''హల్లో రాజూ! ఎంతకాలానికి కన్పడ్డావు. అలా తెల్లబోయి చూస్తావేం. నేనే శ్రీదేవిని. గుర్తుపట్టలేకపోయావా. అవున్లే నేనిప్పుడు గుర్తుంటానా తమకు'' అంది.

ఆమెవాక్కుల్లోని అమృతం అతనిలో ప్రాణంపోసింది. కలలోని శ్రీదేవిని వదలి రైలుదిగిన ఈ దేవిని పలకరించేందుకు అప్పటికిగాని రాజుకు ధైర్యంరాలేదు. బెదురు వదిలినా తడబడేగొంతును సంభాళించుకుంటూ ముసిముసినవ్వులు నవ్వుతూ ''చాలా మారిపోయావు నువ్వు'' అన్నాడు రాజు శ్రీదేవి అనేపదం ఉచ్చరించలేక. బుకింగ్ ఆఫీసులోని గడియారం పదిగొట్టింది.

(565 వ-పేజీ తరువాయి)

కాళ్ళుచేతులు కడుక్కోవడానికి నీళ్ళు అందించింది నీలివేలు.

"కూడుపెట్టు" అంటూ కూర్చున్నాడు తిప్పన్న. నీలివేలు ఏమని సమాధానం చెప్పాలో తెలియక కళ్ళ నీళ్ళు పెట్టింది.

"ఏమిటే నీ నాటకం.- కూడుపెట్టవే అంటే అలా నిలబడ్డావ్ దయ్యంలాగు". తిప్పన్నకు నిసాలో ఏమి అర్థంకాలేదు.

కోపము పెల్లుబికిపోయింది. మీసాలు తిప్పుతూ కొంపకు సస్తే, పిడికెడు బువ్వ పుట్టదు. పస్తుపెట్టి సంపాలనుకుంది" ... తిప్పన్నలో ఆవేశము తగ్గలేదు. కళ్ళు యెర్రగ వున్నయ్. చివాలునలేచి వొళ్లు తెలియని కోపములో నీలవేలును కొట్టాడు. అసలే సన్నగ, నీరసంగవుండే నీలవేలు యీ దెబ్బలతో కూలిపోయింది. బలమైన దెబ్బలు తగలడంవల్ల ఒక్కసారి పెద్దమూల్గుతో నేల రాలిపోయింది. ఎక్కడో నక్కలు అరిచిన శబ్దముతో లీనమైన నీలవేలు కంఠము భయంకర తమస్సులో కలిసిపోయింది

---

# సినీవార్తలు - విశేషాలు

చిత్రపు నారాయణమూర్తిగారి దర్శకత్వాన గాయత్రీవారి 'కృష్ణకుచేల' చిత్రం వడివడిగా నిర్మించబడుతున్నది. ఇందులో సి. యస్. ఆర్., అబ్బూరి వరప్రసాదరావు మున్నగువారు నటిస్తున్నారు. రచన పద్మరాజు.

♦ ♦ ♦

'దేవుడు చేసినమేలు' చిత్రమును నాట్యభారతీ ప్రొడక్షన్స్‌వారి తరఫున డా॥ రాజారావు నిర్మించ పూనుకున్నారు. ఇందులో డాక్టరుగారు లక్ష్మి యనే నూతన నటిని పరిచయం చేస్తున్నారు.

♦ ♦ ♦

రాజు పిక్చర్సువారి 'నిత్యకల్యాణం పచ్చతోరణం' చాలవరకు నిర్మాణమయిందట. ఇందులో చలం, కృష్ణకుమారి, సి. యస్. ఆర్., గుమ్మడి, సంధ్య, రామలింగయ్య మొదలగువారు నటిస్తున్నారు. పిని శెట్టివారి దర్శకత్వము. పెండ్యాల సంగీతము.

♦ ♦ ♦

మహేంద్రవారి 'కృష్ణప్రేమ' చిత్రనిర్మాణం సాగుతున్నది. ఇందులో 'మనోరమ' ఫేమ్ బాలయ్య కృష్ణుడుగా నటిస్తున్నాడు. ఇంకా జమున, రేలంగి, పద్మనాభం మొదలగువారు నటిస్తున్నారు. సంగీత దర్శకత్వం పెండ్యాలవారిది.

♦ ♦ ♦

'జాల్‌సాజ్' చిత్రం ఆధారంగా హైదరాబాద్ మూవీస్ వారు 'జల్సారాయుడు' చిత్ర నిర్మాణమునకు పూనుకున్నారు. ఇందులో జగ్గయ్య, జమున, ముక్కామల మున్నగువారు నటిస్తున్నారు. తాపీ చాణక్య దర్శకత్వము.

## 'బొబ్బిలి యుద్ధం'

ఆంధ్ర విజ్ఞానసమితి (రిజిస్టర్డ్) వారు మద్రాసు వాణీమహలులో యీనెల 13వ తేదీనాడు 'బొబ్బిలి యుద్ధం' నాటకమును ప్రదర్శించారు. రంగారావుగా శ్రీ ఎ. వి. సుబ్బారావు, విజయరామరాజుగా శ్రీ చదలవాడ గోపాలకృష్ణ, మల్లమ్మగా కుమారి డి. సుజాత పేరొన్నతగినట్లుగా నటించారు. బుస్సీ, పాపారాయుడు భూమికలు సయితం ఒప్పించినవి.

ఈ చారిత్రాత్మక నాటకం ప్రదర్శించడంలో ఆంధ్ర విజ్ఞానసమితివారు విశేషంగా ప్రయాసపడవలసి వచ్చినా నాటకం ప్రేక్షకుల మన్ననల నందుకున్నది.

పది, పదిహేను సంవత్సరాలుగా నాటకాలు ఆడుతూ కళాసేవనే ప్రధానంగా కలిగియున్న యీ సమితికి స్థిరమైన స్థావరము, ఆర్థిక సౌష్టవము ఏర్పడకుండుట చాల విచారకరము. మద్రాసు నగరంలోని తెలుగువారు, మద్రాసేతరాంధ్రులు పూనుకున్నచో ఏనాడో ఆంధ్ర విజ్ఞానసమితికి అన్నిహంగులు అమరియుండవలసినది. చలనచిత్ర రంగంలోని ప్రముఖులు సహకరించి సహాయము చేసినచో ఆంధ్ర విజ్ఞానసమితి ఉత్తమ కళాకేంద్రంగా రూపొందగలదు.

శ్రీ లింగమూర్తిగారు చెప్పినట్లు రసికులు, అభిమానులు సహకరించి సహాయపడిననేకాని ఏ కళకాని పోషింపబడి వర్ధిల్లజాలదు. అంజలీ పిక్చర్స అధినేత శ్రీ ఆదినారాయణరావుగారి అపార అనుభవ విశేషాలు, అండదండలు సమితికి లభించగలవని ఆశిస్తున్నాం.

— పున్నయ్య



# శ్రీ సాయిభక్తుల అనుభవాలు

శ్రీ సాయిబాబా దివ్యసందేశము శరవేగంగా దేశమంతటా విస్తరించుట శుభసూచకము. భక్తివిశ్వాసములతో శ్రీ సాయిబాబా నామస్మరణయే అనేకమందికి మానసిక, శారీరకస్వస్థత సమకూర్చుచున్నదనుట అతిశయోక్తి కాదు. ప్రజలలో సమరస సమైక్యతలను, పరస్పరసద్భావ, సానుభూతి సహకారములను శ్రీ సాయిబాబా బోధనలు విస్తృతము చేయుచున్నవి. భూతదయ, పరోపకార, పారమార్థిక చింతలను ప్రోత్సహించే శ్రీ సాయిబాబా దివ్యసందేశము మానవజీవితములో వెలుగుబాటలను సృష్టించుచున్నది.

శ్రీ సాయిబాబాను శరణుజొచ్చి అనేకమంది భక్తులు యిష్టకామ్యార్థ ఫలసిద్ధి పొందుతున్నారు. పతనావస్థలోనున్న అనేకమందిని శ్రీ సాయిబాబా అనుగ్రహకటాక్షములు ఉద్ధరిస్తున్నవి. మానవజీవ యాత్రలో యిహపరలోక సౌఖ్యాల నుద్దేశించి కృషి చేయడానికి ఆరోగ్యమూ, సౌభాగ్యము అవసరము కాబట్టి శ్రీ సాయిభగవాన్ నిరంతరము తన భక్తులను అనుగ్రహించి కాపాడుతుంటాడు. మద్రాసులో - షెనాయ్‌నగర్‌నందలి శ్రీ సాయి నిలయమునకు ప్రతి గురువారం ఆరాధనార్చలకు వచ్చు వేలకొలది భక్తులు యీ సత్యాన్ని వేనోళ్ల చాటుతూ తృప్తిని వెల్లడిస్తుంటారు. ఆరోగ్య సంబంధంగా, ఉద్యోగాలు, పరీక్షలు, వివాహాది శుభ కార్యాలు, కోర్టువ్యాజ్యాలు మొదలగువాని సందర్భంగా శ్రీ సాయిబాబా అనుగ్రహ కటాక్షముల కని స్వామి కేశవయ్యజీని అర్థిస్తుంటారు. స్వామీజీ శ్రీ బాబా అనుగ్రహమును, ప్రసాదమును నిర్విరామంగా పంచిపెడ్తుంటారు. శ్రద్ధ, భక్తి విశ్వాసములతో సాయి నిలయమునందు శ్రీ బాబాను శరణుజొచ్చినవారికి తప్పక వారికోర్కెలు నెరవేరుట కలదు.

బొంబాయి రాష్ట్రంనుండి ఒక రైల్వేస్టేషన్ మాష్టరు స్వామి కేశవయ్యజీకి జాబువ్రాస్తూ "మీ ద్వారా శ్రీ బాబా అనుగ్రహమునకు పాత్రుడనై నేను ఆశించినట్లు అనుకూలమైన బదిలీ యైనందుకు కృతజ్ఞుడను. మీరు చెప్పియిచ్చిన ప్రసాదం 3 నెలల లోపలనే యీ బదిలీని అనుగ్రహించిన సందర్భమున శ్రీ బాబాను, మిమ్ములను కీర్తిస్తున్నాను" అని వ్రాసారు.

♦ ♦ ♦

ఒక సంపన్నగృహస్తుని యిద్దరు కుమారులకు ఒకేసారి జ్వరము తగిలింది. ఎందరో వైద్యులు చికిత్స చేసినను పరిస్థితి ఆందోళనకరంగానే యుండింది. మరొక సాయిభక్తుని సూచన ననుసరించి వారిద్దరిని సాయి నిలయంకు పిలుచుకొనివెళ్లి శ్రీ భగవాన్ సమక్షంలో విభూది ప్రసాదముల నందుకొనిరి. స్వామి కేశవయ్యజీ చెప్పినట్లు ఆ యిద్దరి బాలురకు మరునాడు ఉదయానికే జ్వరం తగ్గిపోయి త్వరితంగా ఆరోగ్యం చేకూరింది.

♦ ♦ ♦

ఒక కస్టమ్స్ ఆఫీసరు, యింకొక తపాలాశాఖ ఉద్యోగి ఉద్యోగరీత్యా చిక్కుల్లోపడి ఉద్యోగాలకే ముప్పమురాగల పరిస్థితులు ఏర్పడినవి. వారు స్వామి కేశవయ్యజీనుండి పొందిన శ్రీ బాబా విభూది ప్రసాదం ఫలితంగా చిక్కులు తొలగిపోయి మరల ఉద్యోగములు దక్కినవి.

♦ ♦ ♦

సంతానప్రాప్తి నుద్దేశించి సాయినిలయమునకు వచ్చు వారనేకులు. ఒక మళయాళ దంపతులు వివాహమయి 18 సంవత్సరములయినా, సంతానములేక శ్రీ బాబా శరణువేడారు. స్వామీజి ప్రసాదించిన

విభూది ప్రసాదములతో బాబా అనుగ్రహ కటాక్షములు పుత్రసంతానమును కలుగచేసినవి.

♦ ♦ ♦

ఒక సుప్రసిద్ధ డాక్టరు భార్య కాలం అనేక సంవత్సరాలు చర్మవ్యాధికి గురియై వికృతముగా నుండేది. అనేకవిధాల చికిత్సలు చేసి, ఔషధములు సేవించినా స్వస్థత సమకూరింది కాదు. కడకు సాయి నిలయంలో స్వామీజీచేతి విభూదిని కొబ్బరినూనెలో కలిపి పైన పూయుటవలన కొద్దికాలమునకే పూర్తిగా నయమాయెను.

యువతీయువకు లిద్దరు ప్రేమించుకొని వివాహ మాడదలచారు. కాని యువతి తల్లిదండ్రులు లాసంబంధమునకు మొదట అనుకూలించలేదు. అప్పుడు వారిద్దరు శ్రీ సాయిబాబా అనుగ్రహ కటాక్షముల నర్థించారు. స్వామిజి విభూదిప్రసాద ఆశీస్సులతో వివాహమై సుఖముగా సంసారయాత్ర సాగిస్తున్నారు.

భార్యాభర్తల మధ్య, అన్నదమ్ముల మధ్య, తండ్రికొడుకుల మధ్య ఏర్పడే కుటుంబకలతలను శ్రీ బాబా సమక్షంలో నివేదించి అనుకూలమును అర్థించి సత్ఫలితములను పొందువారనేకులు.

పరీక్షలువ్రాసి ఫలితములను గురించి శ్రీ బాబా అనుగ్రహమపేక్షించిన వారిలో యీ సంవత్సరము 11 మందికిగాను 8 మంది స్వామీజీ చెప్పినట్లు కృతార్థులగుట బాబా ఆశీర్వాద ఫలమనే చెప్పాలి.

ఒకయువకుడు కుటుంబములో తల్లిదండ్రులు, తమ్ములమధ్య యిమడలేక జీవనోపాధికని మద్రాసుకు పరారయై వచ్చాడు. అనేక కష్టాలకు గురియైనా స్వామీజీ "నీవిప్పుడైనా నిలకడగానుంటే పరిస్థితులు చక్కబడతవి. కాని నీవు స్థిరముగా యిక్కడ యుంటావని నాకు నమ్మకం తోచుటలేదు" అని విభూది ప్రసాదముల నిచ్చాడు. ఉద్యోగందొరికి భార్యాభర్తలు సుఖంగానే యున్నారు. కాని ఆ యువకుని మతిచలనం మాత్రం ఎప్పటికప్పుడు స్థిరంగా నుండదేమో ననిపిస్తుంటుంది.

ఈవిధంగా వేలకొలది భక్తుల నాకర్షిస్తున్న సాయి నిలయం కష్టసుఖాలతో కూడుకున్న మానవ జీవయాత్రను సుగమం చేస్తున్నందుకు కారణం శ్రీ సాయి బాబా అనుగ్రహ కటాక్షములు, స్వామి కేశవయ్యజీ నిర్విరామమైన సేవాకార్యక్రమమని చెప్పాలి. అయితే ప్రతి గురువారం సమావేశమయ్యే వేలకొలది భక్తులకు ఎండకు, వానకు రక్షణ లేకపోవుటచే సాయినిలయం ఎదురుగా శ్రీ సాయిబాబా మందిరమును నిర్మించ ప్రయత్నములు జరుగుచున్నవి. అనేకమంది భక్తులు భూరివిరాళములను వాగ్దానము చేసిరి. కాని భగవత్కార్యాలకు సయితము ఆటంకము కలిగించే వాతావరణము అనాదినుంచి యున్నదే కాబట్టి దానిని భక్తులైన అధికారులు, అనధికారులు గుర్తించి శ్రీ సాయిమందిరము త్వరలో నిర్మించుట కనువుగా సాయినిలయమున కెదుటగల స్థలమును సంపాదించుటకు తోడ్పడవలెను. ముఖ్యంగా మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కె. కామరాజ్, ధర్మాదాయమంత్రి శ్రీ యం. భక్తవత్సలం తదితర ప్రభుత్వాధినేతలు శ్రీ సాయిమందిర నిర్మాణావశ్యకతను గుర్తించి మందిర నిర్మాణమునకు తోడ్పడగలరనియు, కేంద్ర మంత్రి శ్రీ ధాతర్, బొంబాయి గవర్నర్ శ్రీ శ్రీప్రకాశ, ఆంధ్రముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగార్ల వంటి పెద్దలు సాయిభక్తులగుటచే యీ భగవత్కార్యము త్వరలో నెరవేరగలదని ఆశిస్తున్నాము.

'సాధు'



# కొన్ని సూచనలు

శ్రీ మగువాడ సూర్యప్రకాశం

◆ * ◆

అప్పును చేయుట - ముప్పుసుమా !
ఆలిని కొట్టుట - తప్పుసుమా !
నిప్పుతో ఆటలు - ఒద్దుసుమా !
చెప్పును తీయుట - చెడ్డసుమా !
పప్పును తినుటే - బలముసుమా !
ఎప్పుడు నిజమే - చెప్పుసుమా !
తప్పులు - మనిషికి - వచ్చుసుమా !
ఒప్పులు మాత్రమె - ఎన్నుసుమా !
ఉప్పుతో రుచులు వచ్చుసుమా !
తెప్పతో ఈదుట - మెరుగుసుమా !
కొప్పుకు నలుపు - సొగసుసుమా
తుప్పలు అడవిలో - వుండుసుమా
చెప్పుడు మాటలు - చేటుసుమా!
కప్పకు చెఱువే - ఘనముసుమా !
అప్పటి ... రోజులు - మారెసుమా !
ఇప్పుడు రోజులు - గడ్డుసుమా !

# స్వీకారము

**సభావేదిక :** శ్రీమతి వేదుల మీనాక్షీదేవి, c/o సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి. వెల 75 నయాపైసాలు.

ఈ పుస్తకము సభ అంటే ఏమిటో, దాని నిర్వహణను వివరించునది. ఇందులో అధ్యక్ష, వక్తల బాధ్యతలు, వారి ఉపన్యాసముల ధోరణి ఎట్లుండవలెననునదియు, సభ్యులనుగురించి యీ పుస్తకములో వివరించబడినది. ప్రజాస్వామికయుగంలో సభలు, సమావేశములు అన్నిరంగాలలో ప్రధానములు కాబట్టి ప్రతియొక్కరు యీ పుస్తకమును చదువుటవలన వానికి సంబంధించిన విషయములు బోధపడగలవు.

**శ్రీ శివస్తోత్రములు:** శ్రీ పురాణపండ రామమూర్తి ఆధ్యాత్మ ప్రచారక సంఘము, విక్రమహాలు, రాజమండ్రి

ఇందులో శివతాండవస్తోత్రం, శ్రీ శివపంచాక్షరస్తోత్రం, శ్రీ విశ్వనాథాష్టకం, శ్రీ రుద్రాష్టకం, శ్రీ శనిస్తోత్రం, శ్రీ శివాపరాధక్షమాపణస్తోత్రం, శ్రీ శివాష్టకం, ద్వాదశజ్యోతిర్లింగస్తోత్రం, మృత్యుంజయ స్తోత్రం, ఈశ్వరదండకం కలవు. గ్రంథకర్త తన అనువాదముతోబాటు మూలములను పొందుపరచుటవలన అర్థజ్ఞానముతో పఠించి ఈశ్వరానుగ్రహమునకు పాత్రులగుటకు అవకాశముకలదు.

**అహల్యాస్తవము :** శ్రీ పురాణపండ రామమూర్తి. ఆధ్యాత్మ ప్రచారక సంఘము విక్రమహాలు, రాజమండ్రి. వెల 6 నయాపైసాలు.

శ్రీ రాముని పాదధూళిచే శాపవిముక్తిచెందిన అహల్య శ్రీరామచంద్రునికి చేసిన సంస్కృత స్తోత్రమునకు అనువాదము. ఇందులోనే మూలము సయితము పొందుపరచబడియున్నది.

**కర్ణాటక సంగీతము :** వైణిక విద్యాపారంగత శ్రీ R. రంగరామానుజ అయ్యంగార్ B. A. L. T., ప్రచురణకర్తలు యోగవేదాంత ఫారెస్టు యూనివర్ సిటీ, శివానంద నగరము, ఋషీకేశము, హిమాలయములు. వెల రు. 2/-

శ్రీ స్వామి శివానంద సరస్వతి మహరాజ్ అనుగ్రహమునకు పాత్రులైన యీ గ్రంథకర్త సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. ఈ గ్రంథమందు ఉత్తరాది, కర్ణాటక సంగీతముల స్వరూపములు, యుగయుగాలుగా తమిళసంగీతము, ప్రస్తుతపు కర్ణాటక సంగీతస్థాయి, కర్ణాటకసంగీతము పట్ల విధ్యుక్తధర్మము వివరించబడినవి. కర్ణాటక సంగీతమునకు మూలపురుషులు, మార్గదర్శకులనదగు శ్రీ పురందరదాస్, త్యాగరాజస్వామి, శ్రీ ముత్తుస్వామి దీక్షితర్ ల జీవిత ఆదర్శలక్ష్యాలు వివరించబడినవి. ఇందులోనే గ్రంథకర్త యొక్క విద్వత్ విశేషాలను తెలుపువ్యాసములు సయితముగలవు. ఇది ఆంగ్లగ్రంథమయినా సంగీతముపట్ల ఆసక్తిగలవారికి, కళాపిపాసకులకు విశేషముగా తోడ్పడగలదు.

**వెలుగు అధికారము విజ్ఞానము:** శ్రీ స్వామి శివానందమహరాజ్. ప్రచురణకర్తలు: యోగవేదాంత ఫారెస్టుయూనివర్సిటీ, శివానంద నగరము, ఋషీకేశము, హిమాలయములు. వెల రు. 1/-

ఇదియు నాంగ్లగ్రంథమే. ఇందులో వెలుగుకని, అధికారమునకని విజ్ఞానమునకని ప్రాకులాడు మానవకోటికి యిందలి సూచనలు మార్గదర్శకములై దివ్యత్వమును ప్రసాదించునవి. ఇందులోనే స్వామీజీ బోధనలు, ముక్తిసాఫల్యమునకు మార్గములు, ఆయురారోగ్యముల ప్రసాదించుట కనువైన మంత్రములు గలవు. అమూల్యమైన గ్రంథము.

---

## ముఖచిత్రం

శ్రీమతి బార్బారా ఐసెన్ హోవర్ న్యూఢిల్లీలోని ఇండియన్ రెడ్ క్రాస్ ప్రధాన కార్యాలయమును యీ నెల 10 వ తేదిన సందర్శించిన సందర్భమున ఇండియన్ రెడ్ క్రాస్ చైర్మన్ శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ స్వాగతమిచ్చి మానవ ఆసక్తుల పెంపుకు సంస్థ అవలంబించుచున్న పద్ధతులను వివరించుట యీ చిత్రములో చూడనగును.

# సంపాదకీయములు

## గ్రంథాలయోద్యమము

ప్రజలకు విద్య, విజ్ఞానవినోదములు విస్తృతము చేయడము గ్రంథాలయోద్యమముయొక్క ప్రధాన లక్ష్యము. అందుకుగాను రాజకీయాలకే కాదు కుల, మత తత్వాలకు సయితము అతీతముగా ఉద్యమ విస్తరణ సాగాలి. గ్రంథాలయాలు ప్రజలకు సమస్త విషయాలు తెలిసికొని విద్యా విజ్ఞానముల పెంపొందింప చేసికోడానికి, మంచిచెడ్డలను గుర్తించి జీవితాలను తీర్చిదిద్దుకోడానికి వినియోగపడాలి. ఇందుకుగాను గ్రంథాలయోద్యమం నలుముఖాల విశాలహృదయులైన ప్రజల సహాయసహకారములతోటి, ప్రభుత్వ సహాయం తోటి వర్ధిల్లాలి !

## స్త్రీల జీవనోపాధి

మంత్రి శ్రీ సంజీవయ్యగారు స్త్రీల జీవనోపాధికి అంబర్ చర్ఖా వాడకం తోడ్పడుతుందని సలహా యిచ్చారు. దాంతోబాటు మధ్యతరగతి కుటుంబాల ఆర్థికపరిస్థితులు మెరుగు కావడానికి స్త్రీలు చేపట్టగల వృత్తులు అనేకమున్నవి.

ఈనాడు ప్రజావసరాలు అనేకం ఏర్పడినవి. ముఖ్యంగా ఆహార పానీయాలలోను, దుస్తులలోను, గృహోపకరణములలోను అనేకమును స్త్రీలు యింట్లోనేయుండి తయారుచేయడమే కాక వానిద్వారా కుటుంబ ఆదాయమును మెరుగు చేసికొనవచ్చును.

ఆరోగ్యకరమైన ఆహారమును స్త్రీలు రుచికరముగా తయారుచేయుటవలన, విక్రయమునకు ఏర్పాట్లు చేయుటవలన ప్రజారోగ్యం మెరుగు కాగలదు కూడాను. కుట్టుపని, అల్లకం నేర్చుకొనుటవలన కుటుంబావసరాలు తీరడమేకాక ఇంటనుండియే ఆదాయము నార్జించుటకవకాశము కలదు. ప్రస్తుతము వాడకములోనున్న సబ్బులు, పండ్లపొడి, తలకు వినియోగించు నూనెలు, గుండీలు మొదలగునవి యన్నియు స్త్రీలు గృహపరిశ్రమలుగా తయారుచేయవచ్చును. విక్రయమునకు ఏర్పాటు చేయవచ్చును.

ఇంట పాడిచేసి పాలు, వెన్న, నెయ్యి విక్రయించవచ్చును. అప్పడములు, వడియములు లాంటివి సయితము స్త్రీలు తయారుచేయగలరు. స్త్రీలు ఆసక్తితో కృషి చేసినచో కుటుంబ ఆదాయము మెరుగు చేసికొనుటకు అవకాశములు చాల యున్నవి. ఇందుకుగాను మహిళాసంఘాలు నిర్మాణాత్మకంగా కృషిచేసి మార్గదర్శకం కావాలి !

## స్త్రీలు - ఉద్యోగాలు

ఈమధ్య న్యాయశాస్త్రరీత్యా వంశపారంపర్యంగా దక్కే గ్రామాధికారులులాంటి ఉద్యోగాలకు స్త్రీలు అర్హులుగా నిర్ణయించబడింది. ఇది ముమ్మాటికి సంతోషింపతగిన విషయం.

స్త్రీలు పోలీసు, సైనిక ఉద్యోగాలలాంటి వాటికే అర్హులుగా నిర్ణయించబడుతున్నప్పుడు గ్రామమునసబు ఉద్యోగాలకు అర్హులుగా నిర్ణయించబడుటలో విశేషము లేదు. అవి ఇప్పుడు పూనుకొని చేస్తున్న ఉద్యోగాలకంటె కష్టమైనవని గాని, చేయనలవి కానివని కాని చెప్పజాలము. స్త్రీలు గ్రామోద్యోగులు కావడం వలన సామాన్యప్రజలు పడుతున్న యాతనలు తగ్గగలవు. ప్రజలకు కావలసినపనులు సులభంగా నెరవేరగలవు. ఉద్యోగాల నిర్వహణ సయితము క్రమబద్ధంగా జరుగగలదు.

---

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras Ag. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

14367




# 57 ఏళ్లగా ఖ్యాతి గాంచినది.

లోధ్రలో హానికరమైన వేవీ లేవు. సుఖప్రదమైన జీవితానికి ఆరోగ్యాన్ని చేకూర్చడానికి అది గట్టి మందు. కెమిస్టు లందరి వద్ద దొరుకుతుంది.






లోధ్ర స్త్రీల దివ్యౌషధం,

**కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.**
**రాయపేట - మదరాసు - 14.**

ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సాకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ & సికిందరాబాద్, బరంపురం